# శ్రీవాణి 7వ జన్మదిన ప్రత్యేక సంచిక

## జనవరి 1991 (2వ వారంలో) వెలువడుతుంది

* ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక వ్యాసములు కవితలు, కథలు మరెన్నో విజ్ఞాన విశేషాలతో 125 పేజీలతో వెలువడుతుంది "ప్రత్యేక సంచిక".
* భగవాన్ బాబా 65వ జన్మదినోత్సవ వేడుకలు, స్వర్ణోత్సవ విశేషాలు, ప్రముఖుల ప్రసంగాలు, కలర్ ఫొటోలు, బాబావారి దివ్య మహిమలు, ఇంకా ఎన్నో...ఎన్నో విశేషాలతో వెలువడుతుంది " ప్రత్యేక సంచిక ".

## ప్రత్యేక సంచిక వెల: రు. 10_00

* భగవాన్ బాబా జన్మదినోత్సవ సందర్భమున ఈ సంచికతో పాటు 40 పేజీలు గల " శ్రీ సాయివాణి " పుస్తకం కూడా ఉచితంగా పంపబడుతున్నది.
* క్రొత్తగా చేరే చందాదారులకు "కనీస విజ్ఞానం" పుస్తకం ఉచితంగా పంపబడుతుంది.

ముఖ్య గమనిక : సంవత్సర చందా రు. 42_00 లు పంపినవారు పై అన్ని గ్రంథాలను పొందుటకు అధికంగా ఎవరూ పంపనవసరం లేదు.

చందాలు రెన్యూవల్ చేయవలసినవారు వెంటనే చేయండి !

క్రొత్త చందాలను వెంటనే పంపండి ! త్వరపడండి !

ఈ అవకాశమును సద్వినియోగం చేసుకోండి !

## పాఠకులకు మనవి

ఆర్థిక స్తోమత కలిగిన పాఠకులు జీవిత సభ్యత్వంగాని, 4 సం॥ చందాగాని పంపి " శ్రీవాణి "ని ప్రోత్సహించమని మనవి చేస్తున్నాము.

సం॥ చందా : రు. 42_00, 4 సం॥ చందా : రు. 150_00, జీవిత సభ్యత్వము రు. 600_00. జీవిత సభ్యుల ఫోటోలు శ్రీ వాణి 7వ జన్మదిన ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి.

— మేనేజర్

శ్లో॥ అంకోలం నిజబీజసంతతి, రయస్కాంతోపలం సూచికా,
సాధ్వీ నైజవిభుం, లతా క్షితిరుహం, సింధుస్సరిద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే॥

అంకోలం అనే పేరుగల ఒక వృక్ష విశేషముంది. దాని విత్తనాలు ఆ చెట్టు చుట్టుప్రక్కల పడతాయి. వర్షా కాలంలో ఉరుము ఉరవగానే వెంటనే ఆ గింజలన్నీ వాటంతట అవే వచ్చి అంకోల వృక్షంయొక్క కాండానికి అతుక్కుంటాయట. ఇది సృష్టిలో విచిత్రంగా వున్న విషయం.




అలాగే అయస్కాంతం వుంది కదా! దాని దగ్గరలో ఒక యినుపసూది పెడితే చాలు ఆ సూది అమాంతం వెళ్ళి అయస్కాంతానికి అతుక్కుపోతుంది. ఇదీ చిత్రం గానే వుంది కదా!

పతివ్రత అయిన స్త్రీ సర్వదా తన భర్తనే దైవంగా భావించి ఆరాధిస్తుంది. ఆమె మనస్సు మిక్కిలి పవిత్రంగా వుంటూ తన పతియందే ఎల్లప్పుడూ లగ్నమై వుంటుంది. అంటే పతివ్రతయైన స్త్రీ మనస్సు భర్తను వదిలి యితరత్ర తిరగదు.

ప్రకృతిలో తీగ కూడా యింతే. ఏదైనా ఒక చెట్టును ఆధారంగా చేసుకొన్నదంటే చాలు. ఇక ఆ చెట్టును వదలకుండా అల్లుకుపోతుంది. ఆధారాన్ని వదిలే పని లేదు.

దేశంలో ఎన్ని నదులు లేవు? అవన్నీ చివరికి తమ గమ్యమయిన సముద్రాన్నే చేరుకుంటున్నాయి. "నదీనాం సాగరో గతిః" అని అన్నారు కదా! సముద్రం పురుషుడనుకొంటే నది స్త్రీ అని అర్థమవుతుంది. మా సభలలోనే గారు యిలాంటివాటిల్లో కూడా స్త్రీ పురుష సంబంధం చెప్పటం తమాషాగా వుంటుంది.

ఈ పైన పేర్కొన్న అంకోలపు విత్తనానికి, యినుపసూదికి, పతివ్రతా స్త్రీకి, తీగకు, నదికి వీటన్నింటికి తమ గమ్యాన్ని చేరుకోటం సహజ ధర్మం. ఇక్కడ విడదీయరాని సంబంధం ఒకటి వుంది.

సరిగ్గా ఇలాంటి సంబంధమే భగవంతుడికీ భక్తుడికీ మధ్య వుండాలి. అంటే మనిషియొక్క మనోవ్యాపారం భగవంతుని పాదారవిందాలను చేరుకొని అక్కడే నిలిచిపోవాలి. అలా మనస్సు నిలకడగా ఈశ్వరపాదాలపైన నిలిస్తే దాన్నే భక్తి అంటారని ఆచార్య స్వామి ప్రబోధించారు.

అంకోల బీజాదులవలెనే మనిషియొక్క చిత్తంకూడా తన లక్ష్యమైన భగవత్పాదారవిందాలపై హత్తుకోవాలి. అలాంటి చిత్తానికి అన్యచింతనమనేదేదీ వుండదు. ఆ స్థితి ఉత్తమ భక్తికి వుదాహరణం. అదే అనన్య భక్తి అంటే.

"అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"

అని భగవానుడు అలాంటి అనన్య భక్తుల యోగక్షేమాలను నానే వహిస్తానని అభయమిచ్చాడు కూడా.

# బాబా జన్మదినం

"నిజముగా పుట్టిన దినము చేసుకోవటముగాని, జన్మదినము జరుపుకోవటముగాని ఏనాడూ నా కిష్టము లేదు. మీరందరూ కూడా ఏనాడు నిత్యమైన ఆనందమును అనుభవింపుతారో ఆనాడే నాయొక్క పుట్టినదినము, అదే నాకు ఆనందము. అంతేకాక, మీరు తెచ్చే మీ పూలమాలలు, ఫలములు నాకు అవసరము లేదు. వాడిపోయే పూలు, కుళ్ళిపోయే పండ్లు, చేతులుమారే బిల్లలు దాటితే విలువలేని నాణ్యాలూ మీ నుండి నేను స్వీకరించను. ధనాన్ని ఆశించే తుచ్ఛభావం నాలో లేదు. నాకు కావల్సింది పవిత్రమైన ప్రేమ తప్ప ఈ ధనం నాకు అక్కరలేదు. మిమ్మల్ని కోరేది నిర్మలమైన ప్రేమ మాత్రమే. నిస్వార్థమైన ప్రేమను మాత్రమే నేను చేయిని మీముందు చాపేది. నా చేయి ఇవ్వడానికే తప్ప పుచ్చుకోవటానికి ఎప్పుడూ ముందుకు రాదు. మీ దుష్టభావాలను నాకందించండి. నా మంచి భావాలను మీరందుకోండి. తోటి మానవులను ప్రేమించి, వారి బాధలలో భాగము వహించి, వారికి సేవల నాచరించినప్పుడే స్వామికి సరియైన కానుక నిచ్చినట్లుగా ఉంటుంది. స్వామి కోరే కానుక అది ఒక్కటే" అని అంటారు శ్రీ సత్యసాయి బాబావారు.

జన్మదినం జరుపుకొనే సామాన్య వ్యక్తిని కూడా పూలమాలలతో ముంచెత్తి వేయడం, కానుకలు, కాలువలు సమర్పించుకోవటం ఈ దేశంలో అనాదిగా వస్తున్న సంప్రదాయం. కాని బాబావారు మాత్రం ప్రేమతత్వాన్ని మాత్రమే స్వీకరిస్తారు. ఇదే వారి ప్రత్యేకత. అంతే కాదు మనలోనున్న దుష్టభావాలను స్వీకరించి, వారి మంచి భావాలను మనకందిస్తారు. అదే వారి గొప్పతనం. మన మంచిని దోచుకునే వారున్నారుగాని మన చెడ్డను స్వీకరించేవారు ఈ భూమండలంలో బాబా తప్ప మరెవ్వరూ లేరు. మనలో అంతర్గతంగా అణగి, మణిగియున్న ప్రేమతత్వమును బయటకు లాగి మానవత్వం గల మనుష్యులుగా తీర్చిదిద్దటమే బాబా లక్ష్యము. సేవలోని పరమార్థమును ఎరుకపరచి సేవా కార్యక్రమాలలో పాల్గొనే విధంగా ప్రజలను ప్రేరేపించటమే వారి అవతార పరమావధి. ప్రతి హృదయంలో 'ప్రేమజ్యోతి'ని వెలిగించటమే వారి లక్ష్యం. మానవత్వ విలువలైన సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలను గురించి ప్రబోధించి, మనచేత ఆచరింపజేయించడమే వారు తీసుకొనిన కార్యక్రమము. సేవ, విద్య, ఆధ్యాత్మిక రంగములను ప్రక్షాళన చేసి, సంస్కరించటమే వారి అవతార లక్ష్యం. ఈ బృహత్తర కార్యక్రమాన్ని, ప్రపంచంలో మరే మతాధిపతిగాని, మరే బాబాగాని చేబట్ట లేదనే చెప్పవచ్చు. బాబా నిజంగా మన పాలిటి ప్రేమమూర్తే.

" మాసిపోయిన మమత సమతలు
నశించిపోయిన ప్రేమ కరుణలు
మరుగు పడిన మానవత్వము
ఇలను మరల నెలకొల్పగ
దివినుండి భువికి దిగివచ్చిన
ప్రేమమూర్తియె బాబా"

కొమరగిరి

* వయస్సు పెరిగే కొలదీ వైరాగ్యం పెరగాలి.
* వాంఛలు లేకుండుటే వైరాగ్యం.
* వాదన సాధనకు పనికిరాదు.
* వ్యక్తిత్వమే సమాజశక్తి, సమాజశక్తియే దేశశక్తి.

– బాబా

# భగవాన్ సాయి దివ్యలీలలు

భగవాన్ బాబా ఎప్పుడు ఎవరికి ఏమి ప్రసాదిస్తారో, ఏ దివ్యలీలలను ప్రదర్శిస్తారో మనకు అర్థం కాదు. వారి దివ్యశక్తులకు హద్దులు లేవు, వారి దివ్యలీలలకు పరిమితులు లేవు. వారిది అనంతశక్తి, అనంత దివ్యత్వం. ఈ మధ్య జరిగిన ఒక సంఘటన వారి అనంతశక్తికి ఒక చిన్న నిదర్శనం.

శ్రీమతి తాతినేని వెంకట శ్రీకృష్ణవర్ధనమ్మ. ఆమె వయస్సు 77 సం.లు. ఆమె ప్రస్తుతం జ్యేష్ఠ కుమారుడైన శ్రీ తాతినేని వెంకటేశ్వర్లుగారి వద్ద కొడాలిలో వుంటున్నది. వీరు కృష్ణాజిల్లా ప్రజా పరిషత్ హైస్కూలులో టీచరు. గత ఆగష్టు '90లో రెండవ కుమారుడైన శ్రీ తాతినేని రామచంద్రరావు (బందరు) గారింటికి వచ్చింది. ఈయన కే. డి. సి. సి. బ్యాంకులో ఉద్యోగి.

శ్రీమతి వర్ధనమ్మగారు 26 సం. క్రిందట పుట్టపర్తికి వెళ్ళి బాబాను దర్శించుకొని వచ్చింది. అప్పటినుంచి స్వామిని నిత్యమూ ఆరాధిస్తుంటుంది. ది 23-8-90న స్వామి విభూతి కోసం మనుమడు 'సురేష్'ను మా ఇంటికి పంపింది. నా పరిచయము ఆమెకు లేదు, ఆమె పరిచయము నాకు లేకపోయినప్పటికి ఎవరి ద్వారానో తెలుసుకొని విభూతి కోసం పంపింది. స్వామి స్వహస్తాలతో నాకు ప్రసాదించిన ఒక చిన్న విభూతి పొట్లమును ఇస్తూ, ఒక చిన్న స్వామి ఫోటోను కూడా యిచ్చి పంపాను. స్వామి ప్రసాదించిన శివలింగ తీర్థం కోసమో, విభూతి కోసమో నిత్యమూ ఎవరో ఒకరు మా ఇంటికి రావటం పరిపాటి.

విభూతి కోసం పంపితే, స్వామి ఫోటోను కూడా పంపినందులకు ఆమె ఎంతో సంతోషించింది. అమూల్యమైన స్వామి ఫోటో లభించినందులకు తన్మయత్వం చెంది, ఆ ఫోటోనూ చూస్తూ స్వామినే చూస్తున్నట్లుగా ఆనందించింది. ఆ ఇంట్లోనే వుండి బి.కాం. చదువుతున్న వారి బంధువుల అమ్మాయి శివలీల "బామ్మా! నీవు కొడాలి వెళ్ళిపోతావు గదా! అక్కడ బాబా ఫోటో వున్నది గదా! ఇక్కడ లేదు గదా! ఈ ఫోటో మాకు యిచ్చి వెళ్ళుతావా?" అని అడిగింది. సమాధానం చెప్పలేనుగాని బామ్మగారి మనసులో అనేక ఆలోచనలు చెలరేగాయి. కోరకుండానే వచ్చిన ఆ అదృష్టాన్ని (ఆ ఫోటోను) జారవిడచుకోవటం ఎట్లాగా? అని, మరొక వంక ఆ అమ్మాయిని నిరుత్సాహ పరచడం భావ్యమా? అని సతమతమవుతున్న సమయంలో 'శివలీల' బామ్మగారి చేతిలోనున్న ఫోటో తీసుకుంది. అప్రయత్నంగా బామ్మగారి నోటి వెంబడి "నాకో" అనే మాట వచ్చిందో లేదో మరొక ఫోటో బామ్మగారి చేతిలో ప్రత్యక్షమైంది. రెండు ఫోటోలు ఒకే మాదిరిగా వున్నాయి. అప్పటివరకు ఒకే ఫోటోను చూచిన ఆ ఇంటిల్లిపాది ఆనందాశ్చర్యములలో మునిగి తేలారు. ఇది మాయ కాదు. బాబా దివ్యలీలే అనే నిర్ణయానికి వచ్చారు.

బాబా ప్రసాదించిన ఫోటోకు ఫ్రేము కట్టించుకొని బామ్మగారు కొడాలి వెళ్ళారు. ఈ విషయాన్ని తెలిసికొనిన ఆమె పెద్దబ్బాయి "అమ్మా! అసలు ఈ విభూతి, ఫోటో ఎవరిచ్చారు?" అని అడిగాడు. "నీకు తెలియదులే! స్వామి భక్తుడు బందరులో ఒకరున్నారు. ఆయనకు కబురు పంపితే పంపించాడు" అని సమాధానం చెప్పింది. నొక్కినొక్కి అడుగగా ఆఖరికి నా పేరు (కొమరగిరి కృష్ణమోహనరావు) చెప్పింది. ఆయన నాకు తెలియకపోవట మేమిటని ది 31-10-90న బందరుకువచ్చి, నన్ను కొడాలి రమ్మనమని బలవంతం చేశాడు శ్రీ తాతినేని వేంకటేశ్వర్లు గారు. కాదనలేక ది 1-11-1990న కొడాలి వెళ్ళాను. అక్కడి దేవాలయంలో ఒక సభకూడా ఏర్పాటు చేయగా స్వామి దివ్యలీలలను, వారి ఆధ్యాత్మిక సందేశాలను వినిపించే మహద్భాగ్యం స్వామి అనుగ్రహం వలన నాకు లభించింది. బాబా విషయం తెలియని వారెందరో ఆ సభకు వచ్చి స్వామి దివ్యలీలను విని ఎంతో సంతోషించారు. బామ్మగారు కూడా ఆ గ్రామానికి చెందినవారే కావటం వలన ప్రత్యక్షానుభూతిని వారు పొందారు.

కేవలం సభలు, ప్రచారాల వలన మనుష్యులు మారరు, మార్చలేం. స్వామి ప్రదర్శించే ఒక చిన్న దివ్యలీల వేలాది మందిని ఒక్క క్షణంలో మార్చి వేస్తుంది. అదే స్వామి దివ్యశక్తికి నిదర్శనం. — కొమరగిరి

ప్రమాణములు. కనుక ఈ 'ప్రేమజ్యోతి' మనలో వెలగాలంటే మనము హృదయమును ప్రమిదగాను, మనసును వత్తిగాను, భక్తి తైలముగాను వుంచుకొని వైరాగ్యమనే జ్యోతిని వెలిగించుకోవాలి. ప్రాకృతమైన జ్యోతులు బహిర్ముఖమైన చీకటిని పారద్రోలుతాయి. కాని ఈ ప్రేమజ్యోతి, ఈ జ్ఞానజ్యోతి, ఈ అఖండ జ్యోతి, ఈ అద్వైతజ్యోతి అంతర్ముఖమైన ఆనందాన్ని, ప్రకాశాన్ని కూడా అభివృద్ధి పరుస్తాయి.

ఈ జ్యోతిర్మయి స్వరూపుడైన మానవుని కేవలం అజ్ఞాని అనిగాని, మూర్ఖుడనిగాని, బలహీనుడనిగాని భావించరాదు. మానవుడు తలచుకుంటే ఏ పనినైనా సాధించగలడు. అయితే శ్రద్ధ అత్యవసరం. శ్రద్ధ మన ఇంట, జంట, వెంట, కంట వుండి మనల్ని కాపాడుతుంటుంది. కనుక ఆధ్యాత్మికమార్గమందు అత్యంత శ్రద్ధ కలిగివుండాలి. ఈ శ్రద్ధకు ఇచ్ఛాశక్తిని అభివృద్ధి పరచుకోవాలి. ఇచ్ఛాశక్తి వలననే క్రియాశక్తి ప్రారంభమవుతుంది. ఇచ్ఛా, క్రియాశక్తుల వలననే జ్ఞానసిద్ధి ఏర్పడుతుంది. ఈ మూడింటినే త్రికరణశుద్ధి అని వేదాంతం బోధిస్తున్నది. మనసునందున్న భావమును మాటయందు చేర్చి, మాటయందున్న భావమును క్రియయందు అనుభవించాలి.

" నేను సాయినని తెలియుము నిక్కముగను
మమత, కాయము, యత్నముల్ మానుకొమ్ము
కాదు నీకు నాతోటి సంబంధమింక
కాదు నన్ను పట్టుట ఎంతటి ఘనులకైన "

అది అక్టోబర్ సోమవారం 20వ తేదీ (20-10-1940) అని సత్య ఈ పలుకులు పలికినప్పుడు తమ్మిరాజు కుటుంబం, హనుమంతరావు కుటుంబం, మాదరాజు కుటుంబం, శేషమరాజు కుటుంబం - వీరందరూ అనేక విధములుగా అడ్డుపడి నీవు వెళ్ళకూడదు అన్నారు. ఇది ఉరవకొండలో జరిగిన సంఘటన. రామరాజు అనే ఆయన వచ్చి స్వామిని చూచాడు. ఆయన అప్పుడు రాజు! రాజు! అని పిలిచేటటువంటివాడు. చూచి శేషమరాజును ప్రార్థించాడు. ఈ పిల్లవానిని Holidays (శెలవులు) లోపల మా ఇంటిలో పెట్టుకుంటాం. బళ్ళారికి తీసుకొనిపోతామన్నారు. శేషమరాజు! నీవు ఈ బాలుని సోదరునిగా భావిస్తున్నావు. కాదు! కాదు! ఇతని ముఖవర్చస్సు, ఇతని పవిత్రత, నా హృదయాన్ని కరగించింది, కదిలించింది. ఇతని లోపల ఏదో ఒక దివ్యమైన తేజస్సు ఉంటుండాది. నీవు ఆ విధంగా మోసపోతున్నావు. నీవుకూడనూ కొన్ని దినములు వచ్చి మా ఇంట్లో వుండమని కోరాడు. అక్కడనుంచి ఈ మున్సిపల్ ఛైర్మన్ (రామరాజు) హంపికి తీసుకొనివెళ్ళాడు. అందరూ విరూపాక్ష దేవాలయంలో ప్రవేశించారు. నేను రానని చెప్పే కేవలం బాహ్యమైన దీనికి సంబంధముంటుంటేనే వత్తిడి చేయవచ్చును. కోపము పడవచ్చును. నాకు కడుపులో సరిలేదు. నేను లోపలకు రాను అన్నాను. అప్పుడే తమ్మిరాజు కూడా వచ్చాడు, అచట 50, 60 మంది దాకా వున్నారు. అందరూ దేవాలయంలోనికి ప్రవేశించారు. కాని ఈ రామరాజుకు స్వామి చింత తప్ప మరొక చింత లేదు. చాలా పర్యాయములు నన్ను వినయంగా కోరాడు. నేను అప్పుడు చిన్నవాడనుగదా! అయినప్పటికీ ఆ కమీషనర్ వచ్చి నన్ను ప్లీజ్... ప్లీజ్...రాజు మీరు తప్పక రావాలి అంటూ నా చేతులు పట్టుకొన్నాడు. కాని నాయొక్క గట్టితనాన్ని చూచి నన్నెక్కువ తొందరపెట్టలేకపోయినాడు. అందరూ ఆ విరూపాక్షునికి హారతీ యిస్తున్నారు. అక్కడమాత్రం విరూపాక్షుడు లేడు. కేవలం రాజు వున్నాడక్కడ విరూపాక్షుని స్థానంలో. శేషమరాజుకు కోపంవచ్చింది. నేను లోపలకు రాను...రాను... అని చెప్పి ఎప్పుడో వెనుకకుపోయి విగ్రహం వెనుక నుంచున్నాడు. ఎంత పొరపాటు? ఎంత తప్పు? అని అతనికి కోపం వచ్చింది. కాని రామరాజు ఆ విధంగా భావించలేదు. విరూపాక్షుడే రాజు. రాజే విరూపాక్షుడనుకున్నాడు. ఒక్షణం శేషమరాజు వెనుకకు వచ్చాడు, చూచాడు. నేను చెట్టుక్రింద అక్కడనే కూర్చున్నాను. ఆయనకు అనుమానం

రూముకు రమ్మనమనేవాడు. లోపలకు వెళ్ళినతక్షణమే తలుపులు మూసేవాడు. నన్ను తన కుర్చీపైన కూర్చోమని చెప్పేవాడు. తాను క్రింద కూర్చొని నా పాదాలు వత్తేవాడు. సార్ ! మీరు యీ విధంగా చేయకూడదని ఎంతగానో చెప్పేవాడను. ఆ లక్ష్మీపతి అనేటటువంటి వాడు, నీకు తెలియదు యివన్నీ, నాకు తెలుసు నీలో ఏదో ఒక పెద్దశక్తి వున్నదనేటటువంటివాడు పాపం ! ఈ విధంగా ఆనాడు ఉరవకొండ లోపల ఇన్ని విధములైన అలజడులు జరిగిపోయినాయి. అక్టోబర్ 20వ తేదీ ఉరవకొండలో పూర్తిగా మార్పు వచ్చిన దినం. ఆ విద్యార్థులందరిలో కూడనూ ఒక గొప్ప మార్పుకలిగింది. వారి ఆప్యాయత, ప్రేమతత్వం నాపై ఎంతవరకు పెరిగిందంటే ఒక చిన్న ఉదాహరణ. రెండవ దినం ఒక విద్యార్థిని ప్రార్థన చేయమన్నారు. స్టేజీ ఎక్కాడు. ప్రార్థన చేయటం ప్రారంభించి గట్టిగా ఏడ్చేశాడు, ఆ పిల్లవానికి స్వామి జ్ఞాపకం వచ్చాడుట. ఆ పిల్లవాడు ఏడ్చేసరికి పిల్లలంతా ఏడ్చారు. ప్రేయరంతా ఏడుపు క్రింద మారిపోయింది. హెడ్‌మాష్టర్ చెప్పాడు. ఇంకా ప్రేయర్ వద్దు. అంతా లోపలికి పదండి. అతని నిమిత్తం ఏడ్చినదే మన ప్రేయర్.

ఆనాటి మానవత్వమనేది ఇంత అమాయకత్వంలో ఉండినప్పటికినీ, ఆనాడు విద్యార్థులు కేవలం ఒక పవిత్రమైన హృదయాలతో కూడివుండేవారు. ఈనాటి విద్యార్థులవలె విమర్శలు చేసేవారు కాదు, ప్రశ్నలు వేసేవారు కాదు. ఈనాటి విద్యార్థులందు తెలివితేటలు పెరుగుతూ వస్తున్నాయిగాని, గుణం మాత్రం తరుగుతూ వస్తున్నది. ఆనాడు తెలివితేటలు తక్కువ, గుణం ఎక్కువ.

50 సం. లోపల ఈ ప్రశాంతి నిలయంలో ఎన్నో ఘనకార్యాలను సాధించాం. ఈ విధమైన ఘనమైన మార్పులు ఎక్కడనూ జరుగలేదు. ఒక చేతితో ఇన్ని పనులు జరిగాయి. యూనివర్శిటీని ప్రారంభం చేశాం. నక్షత్ర మండలాన్ని తెప్పించాం. ఈ కుగ్రామానికి విమానాన్నికూడా తెప్పిస్తున్నాం. ప్రపంచానికి కేంద్రమయింది ఈ ప్రశాంతి నిలయం. ప్రశాంతి నిలయం ఒక 'మినీ వరల్డు'గా మారిపోతున్నది. రావద్దని చెబుతున్నా ప్రపంచం నలుమూలల నుండి ప్రజలు వస్తున్నారు. ఇంకా ముందు ముందు మీరే చూస్తారు. ప్రశాంతి నిలయం వైభవాన్ని కళ్లారా మీరే చూస్తారు. ఈ విధమైన ఆకర్షణ ఒక్క దైవత్వానికే తప్ప అన్యమునకు ఉండదు. పుష్పములలో మధురమైన మకరందం ఉండటం చేతనే తుమ్మెదలు వచ్చి వాలుతుంటాయి కాని ప్లాస్టిక్ పూలమీద వాలుతాయా !

ఎక్కడ అర్జెంటెయినా ? ప్రపంచానికి కట్టకడపన ఉన్నది. అక్కడ ప్రతి ఇంటి లోపల భజనలే. మయమా అనేది ఉన్నది. అక్కడా అంతా మిలటరీ ఆఫీసర్లే. అక్కడ నగర సంకీర్తన నిత్యం జరుగుతున్నది. 6 నెలల పూర్వం మిలటరీ ఆఫీసర్లంతా ఒక ప్రతిజ్ఞ పట్టారు. పేపర్లలోకూడా చూచి వుంటారు. అక్కడి గవర్నమెంటు పోవాలి, సత్యసాయి గవర్నమెంటు రావాలి అని వారు పట్టుపట్టారు. ఆ మిలటరీ ఆఫీసర్లను తీసుకొని వెళ్ళి పిచ్చి పట్టిందని మెంటల్ హాస్పటల్స్‌లో చేర్చారు. ఆ మిలటరీ ఆఫీసర్లంతా అక్కడ హాస్పిటల్స్‌లో చేరి, అక్కడి రోగులను, నర్సులందర్నీ భక్తులుగా మార్చేశారు. ఇది ఒకరు మార్చితే మారేటటువంటిది కాదు. వారి హృదయాల నుండి అది ఆవిర్భవించాలి.

ప్రేమ స్వరూపులారా !

మీరు ఈ జ్యోతి ఉత్సవాలు జరిపినారంటే, ఇది కేవలం బయటనుంచి కూరినది కాదు, లోపలనుంచి ఊరినది. కనుక ఈ బహిర్ముఖమైన ఈ జ్యోతుల కంటే, అంతర్ముఖమైన జీవనజ్యోతిని పరిశుద్ధ పరచుకొని, కాంతివంతమైన జ్యోతిగా అభివృద్ధి గావించుకోవాలి. సత్యసాయి సంస్థలన్నీ కూడను ప్రేమమయమైన సంస్థలుగా మారాలి. వ్యక్తిగతమైన ద్వేషములను మనం నిర్మూలనం గావించుకోవాలి. జాతి మతకుల భేదములను మనం దూరంగా నెట్టాలి. నీతియే మన జాతిగా మనం భావించాలి. ప్రేమయే మన మతంగా భావించాలి.

(ది 20-10-'90న అవతార ప్రకటన స్వర్ణోత్సవ సందర్భమున భగవాన్‌బాబావారు చేసిన ప్రసంగంనుండి)

## మంజువాణి

పాఠశాల కెళ్ళి పాఠాలు చదువక
దారిప్రక్క నిల్చి డాబు సేయు
చదువుకోనివాడు చదువు 'కొనును' నేడు
నమ్మ బోకుమమ్మ మంజువాణి!
కలిమి కల్గునాడు కావలసినవారే
కలిమి తొలగెనేని కానివారు
గాలివాటు నరుల గారడీ నమ్మొద్దు
నమ్మ బోకుమమ్మ మంజువాణి!
మనసులోన కుళ్ళు, మాటలోన మధువు
మోసమెంతో చేసి మోదమందు
తెంపరైనవాడు తేనె పూసిన కత్తి
నమ్మ బోకుమమ్మ మంజువాణి!

- భైరవభట్ల దేవీప్రకాష్

హరి పూజార్థము పుట్టుచు
సుర కన్యలు భూమి యందు సుందరతనులై
హరి కగ్రజుడై శేషుడు
హరి కళతో బుట్టు తత్ప్రియారంభుండై
ఈ జ్ఞానం కలిగి పుట్టినవారే గోపికలు.

## 23 సూ. తద్విహీనం జారాణామివ

భగవంతుడని తెలుసుకోకుండా సామాన్యుడని భావించి అతనిపై ప్రేమ ప్రకటిస్తే అది జారత్వం వలె వుంటుంది.

నిశ్చల భక్తి కాని జారత్వం. భగవంతునిపై నిస్వార్థమైన నిష్కామమైన ప్రేమాసక్తియే భక్తి. ఆ ప్రేమాసక్తి భగవద్భక్తికి పునాది. తెలిసికానీ తెలియక కానీ భగవంతుని యెడల అనన్య ప్రేమ వ్యక్తమైతే అది నిష్ఫలం కాదు. కాగా తెలిసి చేసిన భక్తి మానవునికి విశేష ఫలం ప్రసాదిస్తుంది.

ఏకైక నిష్ఠతో పరబ్రహ్మపై భక్తి నిలుపలేక సిద్ధిని పొందలేక చంచలుడై వివిధ దేవతలను ఆరాధించటం వ్యభిచరించటం అవుతుంది. భక్తి అవ్యభిచారిణి అయి వుండాలి. బలహీనమైన మనస్సు వ్యభిచారానికి స్థానమవుతుంది. (జారత్వం అంటే వేదాంత పరిభాషలో చపలముగా తిరుగుట లేక మనశ్చాంచల్యం అని అర్థం.)

దివ్యమైన ప్రేమ హృదయ సంబంధి. అది అతి నిగూఢం. ఎవరికి ఆత్మసాక్షిగా హృదయ దర్పణంలో తన శీల సంపదను పరీక్షించుకోవాలి. నిశ్చల నిర్మల పవిత్ర ప్రేమతో కృష్ణ దేవుని ఆరాధించి గొల్లభామలు పరమానందాన్ని పొందగలిగారు. ఇంత పవిత్ర చరిత్రలు కనుకనే వీరి చరిత్రగల భాగవతాన్ని శుకమహర్షి ప్రేమాసక్తితో పరీక్షిన్మహారాజుకు వివరించి చెప్పి మోక్షం కలుగచేశారు.

ఈ ప్రేమ భగవత్ పరం అయినప్పుడు పరమ పవిత్రం, పరమాదర్శం అవుతుంది. దీనికి వ్యతిరిక్తమైనది ప్రేమ కాదు, కారాదదు. పతివ్రత పతిసేవాపర అయి పరుని తలచదు. ద్వేషించదు. అట్లే భక్తుడు తన ఇష్టదైవాన్ని ఉపాసిస్తాడు. అంతమాత్రాన అన్యదేవతలను ద్వేషించడు. గోపికామణులు లక్ష్మీశ్వరుని ఏకైక దీక్షతో వైకుంఠవాసుడని యోగిజన వంద్యుడని సేవించారు.

ఘన లక్ష్మీ యుతమై - వినత
శుభదమై - కామాది నిగ్రహస్థమై -
సనకాదిస్తుతమై - నిరంతర తపస్సంతప్త
పుణ్యాంగజీ
వనమై - యొప్పెడు నీ కథామృతము
ద్రావంగల్గునే భూరి దా
న గూఢత్వము లేనివారలకు
మా నారీ మనోహరా!

శ్రీవాణి

## 24 సూ॥ నాస్త్యేవ తస్మిన్ తత్సుఖ సుఖిత్వమ్

లౌకిక ప్రేమ వ్యవహారాలలో పరస్పర సుఖాభిలాష అమితంగా వుంటుంది. కాని ఈ పరమప్రేమ అంతా నిస్వార్థం, పరిపూర్ణ త్యాగం కనుక ఇది ఉత్తమోత్తమం.

కాముకులు తన సుఖం, తన ఇంద్రియ తృప్తి మాత్రం కోరుకొంటారు. కాని పరమ ప్రేమస్వరూపు లైన భక్తులు పరసుఖం పరోపకారం పరమానందం అభిలషిస్తారు.

గోపికలు పరిపూర్ణ త్యాగమయ జీవులు. ఆ నాటి జనం తన సుఖం తన గౌరవం తన జీవనం 'ఏమౌను' అని ఆలోచించలేదు. పరాత్పరుని ఆనందం కోసం తాము ఏమయినా భరించగలము అని వారి నిశ్చయం.

పరమాత్మునిపై గల ప్రేమ కామం కాదు. భక్తులు కాముకులు కారు. కృష్ణ పరమాత్మ కాముకుడు కాడు. ప్రేమ [illegible], [illegible], [illegible] మూర్తి, [illegible], ఉభయ హృదయ సంతృప్తులు, సంధా [illegible]. గోపికలు కోరుకున్నది ఆ పరబ్రహ్మమునే కానీ ఒక గొల్లవానినీ కాదు, ఒక రాచబిడ్డనూ కాదు.

గోపికలు గోపాలునకు తమ తమ ధనములను, మనసులను, శరీరాలను సుఖాలను విహారాలను ఆహారాలను భవనాలను క్రీడావనాలను కృష్ణ దేవుని పాదారవిందాలకు పూజాసామాగ్రిగా, యజ్ఞేశ్వరునికిచ్చే పూర్ణాహుతి సామాగ్రిగా సమర్పించారు. విశ్వపతి సుఖం మాత్రమే కోరుకున్నారు. ఆయన ఆనందం కొరకై ఏమైనా చేశారే కాని తమకోసం మాత్రం కాదు. వారు ఆ పవిత్ర ప్రేమలోని పరమానుభవం మాత్రం పొందారు.

ఇదే కామానికి ప్రేమకు గల అంతరం. కామం ఇతరులనుండి తనకు రావాలని సుఖం కోరుతుంది. ప్రేమ తననుండి ఇతరులకు సుఖం అందించాలని కోరుతుంది.

## * మీకు తెలుసా? *

1875 లో బెంగాల్‌లోని "జూరీ" పద్ధతి స్థాపింప బడింది.

* మలేసియా, బర్మాలలో దీపావళి రోజున ఇళ్ళను చక్కగా అలంకరించుకొని, వీనుల విందైన సంగీతం విని ఆనందిస్తారు. ఇత్తడి రాగి పాత్రలలో దీపావళి జ్యోతులను వెలిగిస్తారు. బర్మాలో ఈ పండుగ పేరు "టింగీజు" ఆ రోజున బర్మా ప్రజలు బుద్ధుని పూజిస్తారు. బాణసంచా కాలుస్తారు.
* అట్లాంటిక్ మహాసముద్రంలో "సెయిల్ ఫిష్" అనే ఓ రకం చేప వుంది. ఈదటంలో దీని వేగం గంటకు సుమారు 79 కిలోమీటర్లు.
* సుప్రసిద్ధ ఆస్ట్రియన్ పియానిస్టు పాల్ విట్‌గన్‌స్టియన్‌కి యుద్ధంలో చెయ్యి పోయినప్పుడు అతని మధుర సంగీత జీవనమే అంతమయిందన్నారు. కాని ఆయన ఒక చేత్తోనే పియానో మీద మధుర స్వరాల్ని పలికించడానికి ప్రయత్నించాడు. దాంట్లో సఫలీకృతుడై పేరు పొందాడు.

కృష్ణస్వామికి సర్వం సమర్పించటం, ఆయనపట్ల క్షణం వియోగం కలిగితే పరమవ్యాకులత చెందటం, 'స్వామి సర్వజ్ఞుడు సర్వరక్షకుడు' అనే జ్ఞానం కలిగి ఉండటం, మురళీ లోలుని ఆనందంలోనే తామూ ఆనందం అనుభూతి పొందటం ఈ మొదలైనవి గోపికల లోని ప్రేమ గుణాలు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి

# అవతార ప్రకటన వైభవం

ది 20-10-1940 న తమయొక్క దివ్యావతార తత్త్వాన్ని బాహాటంగా లోకానికి చాటి చెప్పారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా! అప్పటికి బాబావారికి 14 సంవత్సరాల వయస్సు.

అంతవరకూ తన తల్లిదండ్రులకు ముద్దుల బిడ్డడు, అక్కలకు, అన్నలకు ప్రియమైన తమ్ముడు. ఉపాధ్యాయులకు ఒక ఆదర్శ విద్యార్థి! కానీ ఆ క్షణం నుంచీ

పాతూరి ప్రసన్నం

అతనిది వసుధైక కుటుంబం! ఉదయించే సూర్యుని ఒక మబ్బుతునక కప్పిపుంచలేనట్లు, ప్రజ్వరిల్లే మహా జ్వాలను ఆవరించిన పొగ అణచలేనట్లు, ఉప్పొంగి ప్రవహించే జీవనదిని గుట్టలు మిట్టలు నిరోధించలేనట్లు ఆకాశాన్ని గుప్పిట్లో దాచలేనట్లు, కారణజన్ముడు, అవతారమూర్తి అయిన శ్రీ సత్యసాయిబాబావారిని తాను జన్మించిన కుటుంబం పరిమితం చేయలేకపోయింది.

"మాయ నన్ను విడిచిపెళ్ళింది. నేను మీకు చెందిన వాణ్ని కాను. నేను సాయిబాబాను. నేను వెళ్తున్నాను. నేను నిర్వహించవలసిన మహాత్కార్యం వేచి వుంది. నా భక్తులు నన్ను పిలుస్తున్నారు. ఇంతవరకు ప్రారంభించనటువంటి నా కార్యక్రమాన్ని ప్రారంభించాలి." అంటూ 14 వ యేట తమ దివ్యావతార తత్త్వాన్ని ప్రకటించి, యిల్లు విడిచి తమ భక్తుల బృందంలో బాబావారు ప్రవేశించారు. ఈ అపూర్వ సంఘటన, ఈ ధర్మోద్ధరణ మహదారంభం, ఈ మానవ కల్యాణపర్వం ఈ రీతిగా నాటి అవతార ప్రకటనతో ఆరంభం అయింది. ఇది జరిగి 50 సంవత్సరాలు గడిచినందున భగవాన్ బాబావారి భక్తులందరూ అవతార ప్రకటన స్వర్ణోత్సవాలు చేసుకుంటున్నారు. వంద దేశాలకు పైగా ఈనాడు ప్రశాంతి నిలయంలో 23-11-1990 న జరిగే దివ్యావతారుని 65 వ జన్మ దినోత్సవంలో పాల్గొంటున్నాయి. లక్షలాదిగా భగవాన్ బాబావారి దివ్యావతార సందేశాన్ని వినటానికి, విలకించటానికి ప్రశాంతి నిలయం వస్తున్నారు.

## అవతార పురుషుని గూర్చిన కొన్ని ఆలోచనలు :

భగవంతుడు మానవ రూపంలో అవతరిస్తే మానవునికి కూడా భగవంతుని గుర్తించే అవకాశం కలుగుతుంది. అందుకే అవతార పురుషుని "దైవం మానుష రూపేణ" అన్నారు.

"There is a special class of world teachers (avatars) over and above the ordinary spiritual masters. If they command, over the lowliest of the low becomes a mahatma. They are the teachers of teachers they are the highest divine manifestation in human form. We can achieve God-realisation only through them. We cannot but worship them, in fact we are bound to worship only such avatars" అంటారు స్వామి వివేకానంద.

"అవతార పురుషులు గురువులకే గురువులు. వారి ఆజ్ఞ అయితే చాలు అధమాధములైన మానవుడు కూడా మహాత్ములవుతారు. వారే మానవ రూపంలోని దివ్యావతార స్వరూపులు. వారి వలననే మానవాళికి అట్టి సాక్షాత్కారం లభిస్తుంది. వారినే మానవాళి ఆరాధిస్తుంది. వారే దివ్యావతార స్వరూపులు" అంటారు స్వామి వివేకానంద.

ఒక్క మాటలో చెప్పవలెనంటే మనకు గల శాస్త్రాలు, పురాణాలు, యితిహాసములు భగవదవతారాన్ని ఎలా వర్ణించాయో, ఆ వర్ణనలన్నీ బాబా వారిలో యదార్థం అవుతాయి. ఇది కాక వివిధ మతములలోని ఆచార్యులు, జ్ఞానులు, జీవన్ముక్తులు భగవంతుని దివ్యత్వాన్ని గూర్చి తాము అనుభవించి చేసిన ప్రకటనలు కూడా బాబావారి యందున యదార్థం అవుతాయి. భగవంతునికి భక్తునికీ మధ్య, మనుజునికీ మాధవునికీ మధ్య, భూలోక పుత్రునికీ, పరలోక పితకూ మధ్య గల అజ్ఞానమనే తెరను తొలగించి జీవునిలో గల దేవుని అనుభవింపజేయటం కొరకే అవతారమూర్తి ఆవిర్భవించేది. ఈ Direct experience కోసమే, ఈ ప్రత్యక్షానుభూతి కోసమే సకల మానవాళి ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయి దివ్య పాదాలను ఆశ్రయిస్తోంది. ఇంతవరకూ పరోక్షమైనది గానే మిగిలిపోయిన ఆత్మజ్ఞానం పుస్తకాలను, మస్తకాలను దాటి మానవాళికి ఒక ప్రత్యక్షానుభవం అయింది. ఈ పరిణతి సాధక లోకం యొక్క సాధన సాఫల్యం వలన కాదు. దివ్యావతారుని కృపావీక్షణ యొక్క ప్రతిఫలం. కనుకనే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి సమకాలికులుగా పుట్టటం ఒక అదృష్టం. వారిని సందర్శించటం ఇంకొంచెం అదృష్టం. వారి దివ్య ప్రబోధలను శిరసావహించి సేవాసాధనను, సేవా యోగాన్ని నిత్య జీవిత పరమావధిగా నిర్వహించటం మరింత అదృష్టం.

## తమను గూర్చిన భగవాన్ ప్రకటనలు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అవతరణ ఫలితంగా ఈనాడు జరుగుతున్న వ్యక్తిగత, సామాజిక వికాసమును గూర్చి చెప్పేముందు, వారి దివ్యత్వమును గూర్చిన కొంత అవగాహన మనకు కలగాలి. అందుకు భగవాన్ బాబావారు ప్రకటించిన సాయీ తత్త్వ విశేషములే మనకు ఆధారం. బాబా యిలా అంటారు —

"బాహ్యదృష్టితో చేసే నిర్ణయములు వాస్తవములు కావు. అదే విధముగా సాయి తత్త్వమును బాహ్య దృష్టితో చూచి, సాయి యిట్టివాడు, అట్టివాడు అని అంటున్నారు. వీరు సాయిలోని పవిత్రతను, యదార్థతను, నిత్య సత్యమును ఏ మాత్రమును గుర్తించలేకున్నారు. సాయి శక్తి అపారము, అనంతము సర్వ శక్తులు సాయి హస్తగతమై వున్నవి."

"నా శక్తులకు హద్దులు లేవు. నా తత్త్వమున కేమాత్రము నియమము లేదు. అనంత శక్తి, అనంత తత్త్వము, అనంత వ్యక్తిత్వము నా చేతులందున్నవి. దీనినిగూర్చి నేను చెప్పవలసి వచ్చినది కనుక చెప్పుచున్నాను..."

"ఒక విధముగా నేను భక్త పరాధీనుడను. సామాన్య మానవుని రూపంలో మీతో కలిసి మెలసి సంచరించుచూ ఆడుతూ పాడుతూ వున్నప్పటికీ మేధా వంతులు శక్తివంతులు కూడా నా శక్తిని, నా స్వభావమును అర్థము చేసుకొనలేరు. మానవత్వమును వీరత్వ పరచి, ఆత్మ తత్త్వమును నిరూపించి దైవత్వము స్థాయిలో చేర్చటమే నా లక్ష్యము."

"ఎన్నో మహత్తర కార్యములు నిర్వహించటానికీ మానవలోకాన్ని ఉద్ధరించటానికీ, మానవులందరినీ ధర్మ శాంతి ప్రేమ మార్గములో నడిపించి వారిని గమ్యస్థానములో చేర్పించటానికే వచ్చాను."

"సాయి అనగా స-ఆయి, దివ్యమాత. బాబా అనగా పిత. కాబట్టి సాయిబాబా అనగా దైవిక మాతా పితలని అర్థము. నాయందు తల్లి గుణములు తండ్రి గుణములూ రెండూ ఉన్నవి. ఈ రెండు స్వభావములూ నాయందున్నందున ఇది శివశక్తి స్వరూపము."

"అవతార రహస్యములను గూర్చి తెలుసుకొనుటకు ఎంతటి పండితులకూ దురవగాహమై యున్నది. విమర్శకులకును అంతు లేదు. వినమ్రులైన విచార శీలురకు మాత్రము సూచనప్రాయముగ అవగత గోచరించునేమో."

“ నేను మానవుడను కాను. మానవాతీతుడను కాను నేనెవరినని మీరనుకోవచ్చు. నేను సత్య ప్రబోధకుడను. నేనే సత్యం, శివం, సుందరం.”

“ నా తత్వము అగమ్యము, అగోచరమును ఐనది. ఇప్పుడే కాదు. ముందెప్పటికైననూ, ఎంత శ్రమించి విచారించిననూ నా తత్వము సర్వ మానవులకును గ్రహించుటకు నసాధ్యమైనది. కానీ నా ఆనందానుభూతి మాత్రము నమ్మినవారికెల్లనూ, ఖండాంతర మతాంతర మానవులకు సహితము అనుభవైకవేద్యముగానుండును. మాయామానుష దేహినై యుండుట వలన మానవులు నన్ను గుర్తింపలేరి. నా నిజస్వరూపమును గుర్తింపుడు. మానవులు పూజించు యితర దైవ రూపములను బోలినదే ఈ దివ్యమానవ రూపోపాధి అని తెలియుడు. ఈ సత్యసాయి దివ్యరూపోపాధి శ్రీ భగవానుని దివ్యావతారమనియే మీరెరుంగుడు. ముందెన్నడోగాక వర్తమానములోనే ఈ లీలోపాధిని కేవలము సత్య తత్వముగ గుర్తించి, గ్రహించి, విశ్వసించి, పూజించు చుండుట మీ జన్మాంతర పుణ్యఫలము వలననే మీకు లభించెనని తెలుసుకొనుడు. విశ్వమెల్లను అచిరకాలము లోనే శ్రీ సత్యసాయి దివ్యావతారమును సందర్శించి బ్రహ్మానంద సాగరమున నోలలాడగలదు.”

పై సందర్భములలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు తమ దివ్య తత్వాన్ని గూర్చి చేసిన ప్రకటనలు సాధక భక్తులకు సులభ గ్రాహ్యములు. భగవాన్ బాబా వారి దివ్యత్వాన్ని సాధక భక్తులుగా అనుభవించిన పుణ్యమూర్తులు ఒక్క భారతదేశంలోనూ, హిందూ మతంలోని వారేకాదు, అన్ని మతాలలోనూ, అన్ని దేశాలలోనూ ఈనాడు వున్నారు. 23-11-1926 న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు అవతరించిన రోజు ననే శ్రీ అరవిందయోగి పుంగవులు, “శ్రీ కృష్ణుడు తిరిగి అవతరించినాడు, ఒక అమోఘమైన విశ్వశక్తి విశ్వమును నడిపించును. సకల ప్రాణుల హృదయము లందునూ అమరజ్యోతి ప్రకాశించును. దైవవాణిని జన బాహుళ్యము వినగలదు” అని ప్రకటిస్తూ, “దివ్యశక్తి మానవాకారంలో ఈ పృథ్వీ తత్త్వంలోకి దిగివచ్చింది. అవతరించింది” అన్నారు.

సంక్షిప్తంగా దివ్యావతారుని అవతార తత్త్వమును గూర్చిన వివరణ యిదే.

“ నిదానము చేసిన, కొద్ది రోజులలోనే ప్రపంచము లోని అన్ని దేశాలవారు కూడా ఇక్కడ చేరుతారు.”

“మీరు నమ్మవచ్చును. నమ్మకపోవచ్చును. సత్యమే నా యదార్థము. అదే నా తత్త్వము. నా పేరు కూడా సత్యము. నా ప్రచారమే సత్యము. కాబట్టి నా తత్త్వము కూడా. విశ్వవృక్షముగా వ్యాప్తికి వచ్చును. నేను వచ్చినదే ఆ నిమిత్తము కొరకు.”

ఒక్కొక్క యుగములో ఒక్కొక్క అవతారము ఒక్కొక్క కార్యరూపము నిమిత్తము జరిగినది...

“ లోకములో నాస్తికత్వము ప్రబలమయినది. మానవులు ఆత్మవిశ్వాసమును పూర్తిగా కోల్పోయినారు. దైవమనగా ఏమి? అను ప్రశ్న వేయువారు అధిక మయినారు. అన్యాయము, అక్రమము, అనిత్యము, అనాచారములే సదాచారముగా ప్రచారమగుచున్నవి. సత్యమునూ, ధర్మమునూ కేవలమూ అనాచారముగా త్రోసివుచ్చుచున్నారు. ఇట్టి పరిస్థితులలో సదాచారమును, సత్ సంప్రదాయమును, ప్రచార ప్రబోధనలు సలిపి ధర్మసంస్థాపనము నిర్వర్తించు నిమిత్తమై ఇప్పుడు రావటము. ఇది యావత్ భారత భూమిలోనేగాక యావత్ ప్రపంచమంతయు వ్యాపించును ”.

భగవాన్ బాబావారు తమ 14 వ ఏట నుంచీ చేసిన దివ్య ప్రకటనలు ఎన్నెన్నో వున్నాయి. ప్రపంచ మానవాళికి మంచిరోజులు రానున్నాయని చెప్పే ప్రకటనలు కూడా ఎన్నో వున్నాయి.

ఈనాడు అనాచారాలూ, అత్యాచారాలూ ముందెన్నడూ లేనంత ఘోరంగా పెరిగిపోతున్నాయి. మానవత్వపు విలువలు పతనమైపోతున్నాయి. ఈ సంకట పరిస్థితుల్లో

Do Good, Be Good, See Good. This is the way to God Realisation. మంచిని చేయి. మంచిగా వుండు. మంచిని చూడు. ఇదే భగవత్ సాక్షాత్కారానికి మార్గం—అని బోధిస్తున్నారు బాబా.

## సమకాలీన సమాజంపై బాబా ప్రభావం:

ఇలాటి దుస్థితిలో ఒక మంచి భావన మనలో కలుగుతుంది. ఈ దుస్థితిలోనుంచి ఒక మంచి, మార్పు రావటం, ఈ చీకటి గర్భంలోనే ఒక వెలుగురేఖ పుట్టటం, ఈ తుఫాను కేంద్రంలోనే ప్రశాంతి నెలకొని వుండటం అనేదే దైవప్రేరణ అనిపిస్తుంటుంది. ఈ మార్పు 2000 వ సంవత్సరం నుంచీ తథ్యమని భగవాన్ బాబా గారు వెల్లడిచేస్తున్నారు.

ఇండోనేషియాలో స్వచ్ఛందంగా సేవ చేస్తున్న భగవాన్ శ్రీ సత్య సాయి సేవా సంస్థలు అక్కడ యువ ఆదరాలను ఎంతో ప్రోత్సాహ పరుస్తున్నాయి. అక్కడి ప్రాథమిక విద్యారంగంలో కూడా మానవతా విలువల శిక్షణ విస్తృతంగా జరుగుతోంది. ఈ సత్ ప్రభావాన్ని ఇండోనేషియా పాలకులు ఆహ్వానిస్తున్నారు. అందుకు భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సంస్థల పాత్ర చాలా ప్రస్ఫుటంగా నిర్వహించబడుతోందని భగవాన్ బాబావారి సనాతన సారథిలో వచ్చిన రిపోర్టులవల్ల తెలుస్తోంది.

అలాగే ఇటలీలో కూడా నైతిక విలువల పునరుద్ధరణలో అక్కడి ప్రముఖులు భగవాన్ శ్రీ సత్యసాయి సేవా సంస్థలతో ఎంతో సహకరిస్తున్నారు. ఇదే రీతిగా ఈనాడు వంద దేశాలకు పైగా భగవాన్ బాబావారి దివ్య ప్రభావానికి లోనైనాయి. ఆయా దేశాలనుంచి భగవాన్ బాబావారిని ప్రశాంతి నిలయంలో దర్శించే నిమిత్తం వందలాదిగా, వేలాదిగా ప్రజలు వస్తూనే వున్నారు.

ఈ రీతిగా భగవాన్ ప్రభావంచేత ఈనాడు ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కాకుండా, ఆధ్యాత్మిక విప్లవం మానవాళి అంతటిలోనూ రూపు దిద్దుకొంటున్నదని శ్రీ విక్టర్ కానూ (Victor Kanoo) అనే ప్రముఖుడు అన్నారు. వీరు లండన్‌లో ఆఫ్రికా దేశాల తరపున ఒక రాయబారిగా పని చేశారు. "భగవాన్ బాబా ఈ ప్రపంచంలో సంభవించటం ద్వారా మానవ జీవితాల్లో అపరిమితమైన మార్పులు రూపు దిద్దుకుంటున్నాయి. ఆధ్యాత్మిక మార్గం దిశగా పెద్ద మార్పు జరుగుతోంది. ఆధ్యాత్మిక విప్లవ రథచక్రాలు వడివడిగా పరుగులిడుతున్నాయి. నా జీవితంలో విప్లవాత్మకమైన మార్పులు బాబావారి సాన్నిధ్యంలోకి వచ్చిన అనంతరం కనబడినందున, నేను స్వామి కార్యక్రమాన్ని ఆధ్యాత్మిక పునరుజ్జీవనం అనటం కంటే ఆధ్యాత్మిక విప్లవంగా తలుస్తాను" అన్నారు శ్రీ విక్టర్ కానూ.

## స్వర్ణయుగం వస్తోంది

త్వరలోనే మంచిరోజులు వస్తాయి. భారతీయ సనాతనధర్మం ప్రపంచం అంతటా కూడా గుర్తింపబడుతుంది. గౌరవింపబడుతుంది. ప్రజాసేవకే అంకితం అయినవారు దేశనాయకులు అవుతారు. వారంతా

నిస్వార్థంగా దేశ ఉన్నతికి పాటు పడతారు. ప్రపంచ దేశాలలో భారతదేశం కూడా ఒక అగ్రదేశంగా రూపొంది, మిగతా దేశాలకు దోవ చూపించుతుంది... ఈ రీతిగా భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు అనేక సందర్భాలలో చెబుతున్నారు. ఇటీవల ఇటలీలోని మేధావులతో కూడిన ఒక పెద్ద సమావేశం జరిగింది. అందులో ప్రముఖ డాక్టర్లు, ప్రొఫెసర్లు పాల్గొన్నారు వారందరూ సాయి తత్వాన్ని గూర్చి చర్చించి, దిగ్భ్రాంతి చెందే ప్రకటనలు చేశారు. ఫ్రెంచి జ్యోతిశ్శాస్త్రవేత్త నోస్ట్రడామస్ చెప్పిన భవిష్యవాణి ఋజువవుతోంది. ఈ కల్లోలిత జగత్తునుంచి మానవాళిని బయట పడవేసే ఒక అద్భుత దైవావతారుడు భారత దేశంలో అవతరించాడు. అతడే సత్యసాయి, అని పై సమావేశంలో ప్రముఖ ఇటాలియన్ మేధావులు చెప్పుకున్నారు.

లండన్‌లోని ప్రముఖ విద్యావేత్త సర్ జార్జి ట్రెవిలియన్‌వారు నోబుల్ బహుమతి గ్రహీతలు. లండన్‌లోని వెస్టు మినిస్టర్ హాలులో జరిగిన ఒక బ్రహ్మాండమైన సమావేశంలో వారు భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారిని రానున్న స్వర్ణయుగానికి కర్తలుగా పేర్కొన్నారు.

ప్రపంచం ఛిన్నాభిన్నమై పోతున్న ఈతరుణంలో భగవంతుని ప్రత్యక్ష దర్శనం మనకు లభించింది. "పరమేశ్వరుని చేరుకొనే ప్రాచీనమైన రాజమార్గాన్ని బాగు చేయటానికే వచ్చాను. ఒక జాతి, మతం, కులం తరపున రాలేదు. మానవులందరి హృదయాలలోనూ ప్రేమ జ్యోతిని వెలిగింపజేయుటయే నా పని"అన్నారు బాబా. సాక్షాత్తు భువి మీదకు భగవంతుడు దిగి వచ్చి చెబుతున్న మాటలివి.

"మానవత్వం మేల్కొనాలి, మేల్కొంటున్నది. ఈ శతాబ్దం చివరినాటికి మానవ సమాజ దేహంలోని జీవకణముల వంటి వారెందరో చైతన్యప్రేరితులై తమ్ము తాము భగవంతుని ఇచ్ఛకు అంకితం చేసుకొనే సూచనలు కాన్పిస్తున్నాయి.

దానికి ప్రపంచ ప్రక్షాళనం ప్రారంభమైంది. ఈ ప్రక్షాళన ఉద్యమం క్రమంగా వేగం పుంజుకుం టోంది. దాని పిలుపును వినగలిగిన ప్రతి ఒక్కరినీ ఉన్నత చేతనావస్థకు లేవనెత్తి కర్తవ్యదీక్షా స్వీకారానికి అర్హతను ప్రసాదిస్తున్నది. ఎదురు నిలిచినవారిని ప్రక్కకు తోసి ముందుకు సాగుతున్నది. ఈ ప్రవాహం ధాటికి నిల్చుకోలేక కొందరు కొట్టుకుపోవచ్చు. ఈ మహా ప్రవాహానికి అనుకూలంగా నడిచి, కాలూనుకొని నిలచేవారు నవయుగానికి సందేశవాహకులవుతారు. మన జీవితకాలంలో జరుగుతున్న అత్యద్భుతమైన సన్నివేశమిది. మానవాళి ఎదుర్కొంటున్న విపత్తు తొలగి తీరుతుంది, స్వర్ణయుగం వచ్చి తీరుతుంది. "నాకు అపజయం అన్నది లేదు. వెనుకకు తిరగటం అవతార పురుషుని స్వభావం కాదు" అన్నారు బాబా.

ఈ రీతిగా భగవాన్ శ్రీ సత్యసాయిబాబా రానున్న స్వర్ణయుగాన్ని నిర్మించే విధాతగా ప్రపంచ మేధావుల చేత గుర్తింపబడ్డారు.

ఈ తరుణంలో మనం కూడా భగవత్ సంకల్పాన్ని శిరసావహించి మానవ కల్యాణానికి సేవ చేద్దాం. భగవాన్ శ్రీ సత్యసాయి సందేశాలను అనుసరించి మనం యింతవరకూ నడచిన దుర్మార్గపు బాటను విడనాడుదాం. అదే మనకు వ్యక్తిగతంగా, సామాజికంగానూ శ్రేయస్సు కలిగించే మార్గం, అంటారు నోబుల్ బహుమతి గ్రహీత సర్ జార్జి ట్రెవిలియన్.

ప్రపంచ మేధావులమీద భగవాన్ శ్రీ సత్యసాయి ప్రభావం ఈనాడు ప్రస్ఫుటంగా గణనీయంగా కనబడు తుంది.

"స్వార్థాన్ని విస్మరించి, అహంకారాన్ని అణగ ద్రొక్కి, పదవీ వ్యామోహాలను పారద్రోలి, సంకుచిత భావాలను విడనాడి, సమాజ క్షేమమునకు, ధర్మస్థాప నకు, న్యాయ పరిపాలనకూ కంకణం కట్టుకోవాలి. దురదృష్టవశాత్తూ శబ్దాలకు అర్థాలే మారిపోతున్నాయి. త్యాగం, న్యాయం, ధర్మం, సేవ ఒక వ్యాపారంగా

మారిపోతున్నాయి. స్వార్థం రాజకీయ నాయకులల్లోనూ విద్యాధికులలోనూ విలయతాండవం చేస్తోంది. అధికార వ్యామోహం పదవీ కాంక్ష పెచ్చు పెరిగిపోయినవి. ఒకప్పుడు త్యాగభూమిగా, కర్మభూమిగా, తపోభూమిగా పేరు పొందిన భారతభూమి భోగభూమిగా మారిపోతున్నది. అందువలననే దేశంలో యిన్ని రోగములు బయలుదేరినవి. ఈ విధానం మారాలి. చరిత్ర పునరావృతం కావాలి. త్యాగశీలురు మీలో వేలకు వేలు ఆవిర్భవించాలి. ప్రతి భారతీయుడు తిరిగి త్యాగమూర్తి కావాలి" అన్నారు భగవాన్ బాబా. రానున్న స్వర్ణయుగానికి ఈ పరివర్తనమే మౌలికపాత్ర వహిస్తుంది. ఇంతవరకూ మనలో ఎన్ని చదివినా, ఎన్ని విన్నా ఈ పరివర్తనం కలగటంలేదు. మహా ప్రభంజనం వీచినప్పుడు దానిని అడ్డుకునే మహావృక్షాలు సైతం కూకటివేళ్ళతో పెళ్ళగిల్లి పడిపోయినట్లుగా, ఈనాటి భగవాన్ శ్రీ సత్యసాయి దివ్య ప్రబోధంయొక్క ఫలితముగా ఎందరెందరిలోనో తమ స్వార్థం, సంకుచిత తత్త్వం అనే విషవృక్షాలు సమూలంగా విరిగిపడిపోతున్నాయి. వారిలో దివ్య పరివర్తనం కలుగుతోంది. ఇదే రానున్న స్వర్ణయుగానికి రాచబాట అంటున్నారు ప్రపంచ మేధావులు.

## స్వర్ణోత్సవ నివాళి

భగవాన్ బాబావారి అవతార ప్రకటన స్వర్ణోత్సవ సంవత్సరంగా ఈ 1990లో బాబావారి భక్తులు ఎన్నెన్నో ప్రత్యేక సేవా కార్యక్రమాలతో సాయీశ్వరునికి సేవ చేశారు. స్వామికి ప్రీతి గొలిపేవి ఈ నిర్మల, నిరాడంబర, నిశ్చలమైన ప్రేమపూరితమైన సేవలే. సకల భాషలకూ అతీతస్వరూపమైన శబ్ద బ్రహ్మమును ఎన్ని స్తోత్రాలు చేసి సంతోష పరచగలం? సకల జగత్తూ రామగా వెలసిన విశ్వేశ్వరునికి ఎన్ని ఆలయాలు నిర్మించి పూజించగలం? అఖండ దివ్య జ్ఞాన జ్యోతి స్వరూపమైన దేవాధిదేవునకు ఎన్ని జ్యోతులతో దీపార్చనలు చేయగలం? భగవాన్ బాబా ఆశించేది ఇవేవీ కావు. "మీరూ నేను ఒక్కటే. నేను మాత్రమే కాదు, సర్వమూ దైవస్వరూపమే. తెలిసి నేను చెప్ప సంకల్పించను. తెలియకపోయినా సర్వం అంతే" అంటారు భగవాన్ బాబా. ఈ రీతిగా భగవదంశ కలిగిన వారమే మనమంతా, అనే స్పృహతో దివ్యాత్మ స్ఫూర్తితో. మనం అందరం ప్రేమజ్యోతులుగా వెలగటమే ఈనాటి అవతారమూర్తికి సమర్పించే మన నివాళి. ○

## వింతలు - విశేషాలు

* మెన్సన్ ఎర్నెస్ట్‌ను 'పరుగు వీరుడి'గా పేర్కొనవచ్చు. అతను ఆసియా, యూరప్‌లలో కొన్ని వేల మైళ్ళు పరిగెత్తాడు. లండన్ నుండి పోర్ట్స్‌మౌత్‌కు గల 186 కి.మీ. దూరాన్ని 9 గంటలలో పరిగెత్తాడట. అలాగే లక్ష [illegible] రూబుల పందెంలో పారిస్ [illegible] 11 [illegible] ఉదయం గం. 4-10 లకు 1832లో బయలుదేరి కాలినడకన 15 రోజులలో మాస్కో చేరాడు. దీని దూరం 2,600 కి.మీ. ఆయన 1840లో [illegible] మెసెంజర్‌గా చేరి అక్కడ నుండి బెర్లిన్‌కు ఉత్తరాలను 14 గంటలలో చేరవేసేవాడు. ఒక్కొక్కరోజు అతడు 150 కి.మీ. పరుగెత్తిన రోజులున్నాయి. ఇతను ఆహారంలో [illegible]లు మాంసం తీసుకున్నా వైన్ మాత్రం విపరీతంగా త్రాగేవాడట.
* 1971 మే 9న అమెరికాలోని వెస్టర్న్ క్యాండిల్ కంపెనీ 50 అడుగుల ఎత్తు 18 అడుగుల వ్యాసం కలిగిన కొవ్వొత్తిని తయారుచేసి ఒక పెద్ద సెంట్రల్ రోడ్డు ప్రక్కగా నిలబెట్టింది.
* 18 వ శతాబ్దం వరకు ఐరోపాలో నస్యం పీల్చడం సభ్యతా చిహ్నంగా పరిగణించబడింది.
* అమెరికాలో 'చవి' అనే కొత్తరకం కారును తయారుచేశారు. అందులో కూర్చుని ఏదైనా చదువుకుంటూనే ప్రయాణించవచ్చు. విశేషమైన దీపం ఆ కారులో వుంది. చదివే పుస్తకం మీద మాత్రమే దాని కాంతి పడుతుంది.

# కొమరగిరి కారాగార లేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 19-4-1976

ప్రియమైన జయ,

గత రెండు ఉత్తరములలో శ్రీరాముని, సీతను గురించి వ్రాసాను. రామాయణ మహాకావ్యమునుండి హనుమంతుని మినహాయిస్తే అసలు కథే లేదేమోనని పిస్తుంది. శ్రీరామునికి ఆత్మార్పణము గావించిన పరమ భక్తుడు ఈయన. సర్వశక్తిసంపన్నుడు. సకల విద్యావేత్త, నవవ్యాకరణవేత్త, అద్భుతమైన వక్త–వీటన్నికన్నా అద్భుతమైన ప్రభుభక్తి కలవానిగా, కార్యాచరణ శక్తియుక్తులు కలవానిగా, మరియు దౌత్యకర్మను నిర్వహించటంలో అతి చాకచక్యము, నైపుణ్యముకలవానిగా వాల్మీకి హనుమంతుని గూర్చి వర్ణించాడు. పెక్కు పురాణములు అతనిని శివావతారముగాకూడా వర్ణించాయి.

" దుష్టానాం శిక్షణార్థాయ శిష్టానాం
రక్షణాయక
రామకార్యార్థ సిద్ధ్యర్థం జాతశ్శ్రీ
హనుమాఞ్ఛివః "

అనగా దుష్టులను శిక్షించుట కొఱకును, శిష్టులను రక్షించుటకును, రామకార్యాసిద్ధి కొఱకును శివుడే హనుమంతునిగా అవతరించియున్నాడని పురాణములు ఘోషిస్తున్నాయి. సీతాన్వేషణకు హనుమంతుడు చేసిన సాహసకృత్యములను, సామాన్య మానవుడుగాని, వానరుడుగాని చేయలేడనే విషయం సుస్పష్టం. అతను దైవాంశ సంభూతుడు కావటంవల్లనే రాముని కార్యాన్ని విజయవంతంగా నిర్వహించగలిగాడు. అతను కారణ జన్ముడు. అతి దుష్కరమైన కార్యాన్ని నిర్వహించటం వల్లనే శ్రీరాముడు సహితం "జానకిని కనుగొని నన్నూ నా వంశమును పరిరక్షించినాడు. అతని బాహుబలము వలననే నేను లంకను జయించితిని. సీతను తిరిగి పొందగలిగితిని. లక్ష్మణుడు తిరిగి దక్కినాడు. విజయము లభించినది. రాజ్యము లభించినది" అని హనుమంతుని పొగడుతాడు. అతనిలో ఉత్తమ దౌత్య లక్షణాలు ఎన్నో వున్నాయి. బలము, బుద్ధి పరాక్రమాదులే కాక, దేశ, కాల పరిస్థితుల నెరిగి సంచరించగల తెలివితేటలుకూడా వుండటం వల్లనే, సీతను చూచి రమ్మంటే, లంకాపురిని దగ్ధం కావించి రావణుని భయకంపితుని చేసి వచ్చాడు. అంతేకాదు జంబుమాలిని, అక్షయ కుమారుని ఐదుగురు సేనాధిపతులను, ఏడుగురు మంత్రి కుమారులను మరియు అనేకమంది రాక్షసవీరులను సంహరించాడు. హనుమంతుని బలపరాక్రమములను ఇంద్రజిత్ కూడా చవి చూశాడు. మూడు అదరబట్టే ఇంద్రునితో సమానమైన ఇంద్రజిత్తును పిలచి రావణుడు "హనుమంతుడు సాధారణ బలసంపన్నుడు కాదు. అతని ముందు మన సేనలు ఎందుకూ పనికి రావటంలేదు. వజ్రాయుధము వంటి ఆయుధములు సయితం అతనిని ఏమీ చేయజాలకున్నవి. అతని గతి మారుతుని గతి, అతని శక్తి అగ్నిహోత్రుని అతిక్రమించినది. బ్రహ్మాస్త్రాన్ని పొందిన నీవు తప్ప, ఈ కోతిని ఎదిరించగల శక్తి సామర్థ్యములుగల వారెవ్వరూ నాకు కనిపించటంలేదు. వీడితో బాహాబాహీ యుద్ధము పనికిరాదు. ఏమి చేయాలో బాగా ఆలోచించి, నువ్వు అతడ్ని ఎదిరించి విజయంతో తిరిగి రా!" అని ఆజ్ఞాపిస్తాడు.

లంకా యుద్ధమునందు హనుమంతుడు ప్రదర్శించిన బలపరాక్రమాదులను వర్ణించ శక్యము కాదు.

ధూమ్రాక్షి, అకంపన, దేవాంతక, నికుంభాది రాక్షస వీరులను వధించగా, అతని పరాక్రమమును చూచి నివ్వెరపోయి, త్రిలోక విజేతయగు రావణాసురుడే "సాధు వానర వీర్యేణ శ్లాఘనీయోఽసిమే రిపుః" (ఓ వానరా! శభాష్, నీవు శ్లాఘను పందుకొనుటకు తగిన శత్రువువవు) అని మెచ్చుకుంటాడు. అతని వాక చక్యము, సమయస్ఫూర్తితో ప్రదర్శించిన బల పరాక్రమములు, నిర్భీకత్వము, అతడ ననుసరించిన వాక్యవిధానము దర్బారులో రావణుని మనకు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. హనుమంతుడు ఎంతో హుందాతనంగా, ధైర్యంతో రావణుని దర్బారులో హెచ్చరిస్తాడు, హితవును కూడా బోధిస్తాడు. "నేను సుగ్రీవుని దూతను. నా ప్రభువైన సుగ్రీవుడు రామ లక్ష్మణులతో సఖ్యం చేసుకొనినాడు. అతి బలాఢ్యుడైన వాలిని ఒక్క వేటులో సంహరించి సుగ్రీవుని కోరికను నెరవేర్చినాడు రాముడు. కృతజ్ఞతతో సుగ్రీవుడు తన వానరసేనలను సీతాదేవి జాడను తెలుసుకొనుటకు భూలోకమంతా వెదకమని పంపించి నాడు. ఆ సందర్భమున నేను వేయి యోజనముల సముద్రమును లంఘించి లంకలో అడుగుపెట్టాను. సీతను అశోకవనంలో చూచాను. అటువంటి పతివ్రతా శిరోమణిని అపహరించటం ధర్మవిరుద్ధం. అది కుల నాశనానికి దారి తీస్తుంది. పరాయి స్త్రీని కోరటం మహా పాపం. సర్వశక్తివంతుడైన శ్రీరామునితో వైరం అంత మంచిది కాదు. అది మీ వంశ సర్వనాశనానికి దారి తీస్తుంది. ఏ శక్తీ తమర్ని రక్షించలేదు. ఈ లంకాపురిని, రాక్షసులందర్ని ధ్వంసం చేయగల శక్తి నాకొక్కడికే వున్నప్పటికీ, శ్రీరాముని ఆజ్ఞలేదు కాబట్టి ఆ పనికి నేను పూనుకోలేదు. సీతయొక్క పాతివ్రత్య తేజము చేతనూ, శ్రీరాముని కోపాగ్ని చేతను నీవు, నీ అనుచరులు నాశనమవుతారు. కనుక నా పలుకులను ఆలకించి పతివ్రతాశిరోమణి అయిన సీతను శ్రీరామునికి అప్పగించి, మీ లంకాపురిని, మీ పరివారాన్ని బంధు

## చెతన్లా వా

* నామం అనగానే రామం మదిలో కదుల్తుంది. గుణాభిరాముడైన రామచంద్రుని దివ్యనామమే రామం. అది తారకనామం. సద్రూపులను గావించే సౌజన్యనామం. చిద్రూపులను గావించే సౌశీల్యరూపం.

* బాధలు కలిగాయని చింతించకు. బోధలతో వాటిని బాగుచేసుకో. నీ సేవలను అందరూ గ్రహిస్తారు. నీ బాధలను భగవానుడే అర్థం చేసుకోగలడు. నిన్ను గ్రహించగలడు. ఆశీర్వదించగలడు.

అద్దము చూపవంతులకు, చూపహీనులకు యిరువురికి ఉపయోగపడుతుంది. చూపవంతులు ఆనందించేందుకు, చూపహీనులు అలంకరించు కొనేందుకు. శాస్త్రముకూడా జ్ఞానులకు, అజ్ఞానులకు యిరువురికి ఉపయోగిస్తుంది. జ్ఞానులు ఆనందముగా వీక్షించేందుకు, అజ్ఞానులు వీక్షించి ఆనందమును పొందేటందుకు.

సేకరణ: ముల్లాపి సూరిబాబు

మిత్రులను రక్షించుకోవటం సముచితం" అని బందీ నయినాననే భయం కూడా లేకుండా స్పష్టంగా చెబుతాడు. హనుమంతుని మాటలు వినిన లంకేశ్వరుడు కోపోద్రిక్తుడై యీ కోతి తోకకి నిప్పు ముట్టించి తరిమి వేయండని ఆజ్ఞాపిస్తాడు. హనుమంతుడు విశ్వరూపం దాల్చి మండుతున్న తోకతో లంకాపురినంతా దగ్ధంచేసి, అశోకవనమునకు వెళ్ళి సీతకు ధైర్యాన్ని చెప్పి సముద్రం దాటుతూవుండగా తనకు విశ్రాంతి యివ్వటానికి పైకి వచ్చిన మైనాకునితో "నేను ఆగుటలేదని కోపించకు. ప్రొద్దుగుంకుతున్నది. నాపై గల కార్య

భారమును బట్టి నేను ఆగుటకు వీలులేదు" అని చెప్పి చేతితో అతనిని స్పృశించి పైకి ఎగిరి తన మార్గంలో పోతాడు. ఈ సంఘటనను బట్టి హనుమంతునిలోని కర్తవ్య పరాయణత్వము, కార్యదీక్ష, పట్టుదల ఎంతటిదో మనకు బోధపడుతుంది. దూత అయినవాడు ప్రభు కార్యమును నిర్వహించటంలోనే తన దృష్టిని, శక్తినంతటిని కేంద్రీకరించవలెనుగాని, ఉన స్వసుఖ, సంతోషములకాశపడి ప్రభు కార్యాన్ని నిర్లక్ష్యం చేయరాదనే నీతిని హనుమంతుడు పాటించి చూపించాడు. నేటి రాయబారులు, దూతలు హనుమంతుని ఆదర్శంగా గైకొంటే ఎంతో బాగుంటుంది. రాచకార్యములను నిర్వహించువారు అప్రధానమగు కార్యములతో ఆకర్షించబడకుండా, అసలు కార్యాన్ని సకాలంలో నిర్వహించాలి.

హనుమంతుడు నిర్వహించిన అద్భుత దూత కృత్యములను శ్రీరాముడు సంతసించి "ఇటువంటి మహత్తర కార్యాన్ని, ఈ భూమండలంలో హనుమంతుని లాగే మరెవ్వరూ నిర్వహించలేరు. ఇతను చేసిన పని వల్ల మొత్తం రఘువంశమే విపత్తుకు గురి కాకుండా రక్షించబడింది" అని ప్రశంసిస్తాడు.

హనుమంతుడు సముద్రాన్ని దాటాలని సంకల్పించు కున్నప్పుడే ఒక నిశ్చయానికి వస్తాడు. తన మనో నిశ్చయాన్ని ఆనాడే ప్రకటించుతాడు. "శ్రీరాముని బాణ వేగమువలె లంకకు పోవుదును. అక్కడ సీత కనపడనియెడల రావణునితో సహా లంకాపురిని పెకలించి తీసుకొనివచ్చి శ్రీరాముని ముందు పెడుతాను" అని అంటాడు. అతని మాటలనుబట్టి అతనికి శ్రీరాముని యెడల గల భక్తిప్రపత్తులు చేబట్టిన కార్యాన్ని నిర్వహించటంలోగల పట్టుదల, అచంచలమైనవిశ్వాసం ఎట్టిదో గోచరమవుతున్నది, ప్రస్తుత పరిపాలకులలో అటువంటి దృఢ విశ్వాసపరులైన కర్తవ్యనిష్ఠులు లేకపోవటంవల్లనే రాచకార్యాలు దెబ్బ తింటున్నాయి.

విదేశములకు వెళ్ళు రాయబారులు, విదేశాంగ మంత్రులు - ఇతర దేశములతో దౌత్యమును ఎటుల జరుపవలెనో, విదేశములకు వెళ్ళువారియందు ఏయే గుణములుండవలెనో హనుమంతుని పాత్రను సరీగా అవగాహన చేసుకున్నయెడల విదేశాలతో విజయ వంతంగా దౌత్య సంబంధాలు నిర్వహించగలుగురారు. హనుమంతుని వ్యక్తిత్వం యీ భూమిమీద మానవకోటి యున్నంతవరకు శాశ్వతంగా కొనియాడబడుతూనే వుంటుంది.

ఇకపోతే నీ ఉత్తరం సాకల్యంగా చదివాను. నీవు వ్రాసిన సలహా గుర్తించవలసిందే. నేర్చుకోవటంలోనే మురిసిపోకూడదు. నేర్చుకొన్నవాటిలో కొన్నింటినైనా నిత్య జీవితంలో ఆచరణలో పెట్టగల్గితేనే ప్రయోజనం వున్నది. ప్రయత్నం చేయటం మన కర్తవ్యం కదా! ప్రయత్నం చేయకుండా ఏ పనీ దానంతట అదే సాధించబడదు. పనులు కోర్కెలవల్ల నెరవేరవు. ప్రయత్నము చేతనే నెరవేరుతాయి. మృగరాజైన సింహముకూడా, ఏ మాత్రం ప్రయత్నం చేయకుండా, నేను యీ అరణ్యానికంతటికీ రాజునని విర్రవీగుతూ నిద్రబోయినయెడల దానికి కడుపు నింపుతుందా? ఆ నిద్రబోతున్న సింహం నోటిలోనికి మృగములు ఆహారంగా వాటంతట అవే వస్తాయా? ఏమాత్రంరావు. మృగరాజైన సింహము సహితము వేటాడితేనే కడుపు నిండుతోంది. అదే విధంగా ప్రయత్నంవల్లనే కోరికలు నెరవేరుతాయి. ఇదే భావాన్ని తెలియబరుస్తున్న యీ శ్లోకమును అర్థం చేసుకుంటే చాలు.

"ఉద్యమేన హి సిధ్యంతి
కార్యాణిన మనోరథైః
న హి సుప్తస్య సింహస్య
ప్రవిశంతి ముఖేమృగాః"

చిరంజీవులకు నా ఆశీస్సులు, ఉంటా...

# కులతే పన్నె తెచ్చిన వెంకటప్పయ్యగారు

న్యాయవాద వృత్తులు మానుకొని స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనమని మహాత్మాగాంధి పిలుపు ఇవ్వడానికి ఐదు సంవత్సరాలకు ముందే మూడు పువ్వులూ ఆరు కాయలుగా వర్ధిల్లుతున్న తన న్యాయవాద వృత్తిని ఐచ్ఛికంగా మానుకుని సమాజసేవను సంఘ సంస్కరణోద్యమాలను, ప్రజలలో రాజకీయ సామాజిక చైతన్యం కలిగించడానికి తన జీవితాన్ని అంకితం చేసిన మహనీయుడు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు. నిరాడంబరత, రుజుప్రవర్తన, త్యాగశీలతకు మరో పేరు అయిన వెంకటప్పయ్యగారిని అర్థం చేసుకోవాలంటే ఇంకా చాలా వెనక్కు వెళ్ళాలి. చదువుకుంటున్న రోజులలో ప్రైవేట్లు చెప్పుకుంటూ సంపాదించుకున్న డబ్బును తోటి విద్యార్థులకు ఇచ్చి సహాయపడిన సంఘటనలను, 1887లో మద్రాస్‌లో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలలో వాలంటీరుగా పనిచేసి తన రాజకీయ జీవితానికి శ్రీకారం చుట్టుకున్న విషయాన్ని గమనించాలి.

తెలుగు ప్రజలలో రాజకీయ సామాజిక వైజ్ఞానిక చైతన్యానికి ఏర్పడిన కృష్ణాజిల్లా సంఘంలో పదేళ్ళపాటు ఆయన నిర్వహించిన పాత్ర ఒక ఎత్తు అయితే జిల్లా సంఘం ఆధ్వర్యంలో 1902లో ఆంధ్రుల తొలి జాతీయ పత్రిక కృష్ణా పత్రికను స్థాపించి, తెలుగు పత్రికా ప్రపంచంలో చరిత్ర సృష్టించడం మరో ఎత్తు. తొలి తెలుగు జాతీయ పత్రికకు ఆయన తొలి సంపాదకుడు. అప్పటి పబ్లిక్ ప్రాసిక్యూటర్ రావుబహదూర్ నెడించి హనుమంతరావుగారితో కలిసి నిజమైన "న్యాయవాది"గా పనిచేసి న్యాయ వ్యవస్థకే వన్నె తెచ్చారు.

1904లో కృష్ణాజిల్లా విభజన జరిగి గుంటూరు జిల్లా ఏర్పడ్డంతో వెంకటప్పయ్యగారి కార్యరంగం గుంటూరుకుమారింది. అక్కడ ఉన్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్లతో కలసి జిల్లాలో రాజకీయ చైతన్యానికి నడుం కట్టారు. వెంకటప్పయ్యగారు రాజకీయరంగంలో ప్రవేశించడానికి ముందు ఆంధ్ర నాయకత్రయంగా ఆంధ్ర

కంచి వాసుదేవరావు

ఓప్మన్యాయపతి సుబ్బారావు, ఆంధ్ర గోఖలే మోచర్ల రామచంద్రరావు, బయ్యా నరసింహశర్మల ప్రభ ఉజ్జ్వలంగా వెలిగిపోతూ వుండేది. ఐతే వీరు ముగ్గురూ మితవాదాలకు ప్రతినిధులు. కొత్త నాయకత్వానికి వెంకటప్పయ్యగారు ప్రతినిధి అయ్యారు

వెంకటప్పయ్యగారు తన రాజకీయ జీవితంలో స్వరాజ్యం, స్వరాష్ట్రం అనే వాటిని జంట లక్ష్యాలుగా పాటించారు.

1913 బాపట్లలో బయ్యా నరసింహశర్మగారి అధ్యక్షతన జరిగిన తొలి ఆంధ్ర మహాసభలు జరిగినప్పుడు ఆయన ఆహ్వాన సంఘ అధ్యక్షునిగా వుండి వాటిని జయప్రదం చేశారు ఆ తర్వాత బెజవాడ, విశాఖపట్నాలలో న్యాయపతి సుబ్బారావు, పానగల్లు రాజాల అధ్యక్షతలతో జరిగిన ఆంధ్ర మహాసభలలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేయించారు. భాషా ప్రాతిపదికగా రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ జరగాలనే సూత్రాన్ని జాతీయ కాంగ్రెస్ అంగీకరించడంతో 1918లో ప్రత్యేకంగా ఆంధ్ర

రాష్ట్ర కాంగ్రెస్ ఏర్పడింది. దీనికి కొండా వెంకటప్పయ్యగారు అధ్యక్షులుగా, గొల్లపూడి సీతారామశాస్త్రి కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

1920 నుంచి మహాత్మాగాంధి నాయకత్వంలో జాతీయ కాంగ్రెస్ స్వాతంత్ర్యోద్యమాలలో [illegible] వచ్చింది. వయస్సులో చిన్న కన్నా పెద్దవారైన వెంకటప్పయ్యగారిని గాంధీజీ అగ్రజుడిగా గౌరవించి మన్నించేవారు. 1946లో ఎన్నికలు జరిగి దాదాపు అన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

స్వాతంత్ర్యసిద్ధి కనుచూపు మేరలో వుండటం కాంగ్రెస్ నాయకులలో పదవుల కోసం స్పర్థలు ప్రారంభమయ్యాయి. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో గాంధేయ పద్ధతులతో పరిపాలన సాగిస్తున్న ప్రకాశం ప్రభుత్వం ముఠా తగాదాల కారణంగా [illegible]. ఆ తర్వాత ఓమాందురు రామస్వామి రెడ్డియార్ నాయకత్వంలో కొత్త మంత్రివర్గం ఏర్పడింది. అప్పటికీ కాంగ్రెస్ మంత్రులలో పదవీకాంక్ష పెరిగి అవాంఛనీయమైన అనైతిక ధోరణులు వ్యక్తం కాసాగాయి. మద్రాస్ రాష్ట్రంలోనే కాదు, దేశమంతటా కాం-లలో పతనమవుతున్న నైతిక ప్రమాణాల గురించి మహాత్మాగాంధి, వెంకటప్పయ్యలగారి మధ్య ఆవేదనాభరితమైన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వుండేవి. ఈ పతనాన్ని గమనించి, స్వాతంత్ర్యం రాగానే జాతీయ కాంగ్రెస్ రద్దయి, దాని స్థానే లోక్‌సేవాసంఘ్ ఏర్పడాలని మహాత్మాగాంధి సూచించారు. అది జరిగి వుంటే దేశచరిత్ర మరోవిధంగా వుండేది. అది వేరే సంగతి. ఈ యిద్దరి మధ్యవున్న సాన్నిహిత్యాన్ని వివరించడానికి పై సంఘటన పేర్కొనడం జరిగింది.

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి చిత్తరంజన్ దాస్ రాజీనామా చేయడంతో తాత్కాలిక అధ్యక్షునిగా వెంకటప్పయ్యగారు ఎన్నికయ్యారు. ప్రధాన కార్యదర్శిగా అనాటి రాజకీయాలలో చిచ్చరపిడుగు అయిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఎన్నికయ్యారు. ఏఐసిసి

# లు-
# సమాధానాలు

1. "కామెరూన్" దేశపు రాజధాని ఏది ?
2. మాంగనీస్‌ను అత్యధికంగా ఉత్పత్తి చేయు దేశమేది ?
3. రంగూన్ నగరము ఏ నది ఒడ్డున ఉన్నది ?
4. "బెచ్యూవానాలాండ్" అని పూర్వనామముగల నగరమేది ?
5. గ్రహాలలోకెల్లా పెద్దదైన దేది ?
6. "సారో ఆఫ్ చైనా"గా పేర్గాంచిన నది ఏది?
7. "ఐరన్ డ్యూక్"గా ప్రసిద్ధి పొందిన వ్యక్తి ఎవరు ?
8. స్వీడన్ పార్లమెంట్ పేరు ఏమిటి ?
9. "ఈస్టర్న్ సన్" వార్తాపత్రిక ఎక్కడనుంచి వెలువడుతుంది ?
10. IMF అంటే ఏమిటి ?
11. బొంబాయిలోని విమానాశ్రయం పేరేమిటి ?
12. సిమెంటును ఎవరు ఎప్పుడు కనుగొన్నారు ?
13. " విలాయత్‌ఖాన్ " ఏ వాయిద్యకారునిగా పేర్గాంచాడు ?

1. 'యావుండీ' నగరం 2. రష్యా 3. 'ఇరావతి' నది 4. బోట్‌స్వానా 5. జ్యూపిటర్ 6. హువాంగ్ హో నది 7. డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ 8. రిక్స్ డాగ్ 9. సింగపూర్ నుండి 10. ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్ 11. శాంతాక్రజ్ 12. బ్రిటన్ దేశస్థుడైన "ఏస్పిడిన్" 1845 లో 13. సితార్

ప్రధాన కార్యాలయం తాత్కాలికంగా బెజవాడకు తరలి వచ్చింది. ఇప్పటికీ ఈ శతాబ్దం మొదట్లో నాగపూర్ కాంగ్రెసుకు అధ్యక్షత వహించిన సేలం ఆంధ్రుడు పక్షాపాతం ఆనందాచార్యులుగారిని వదలివేస్తే జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవిని చేపట్టిన తొలి ఆంధ్రుడు వెంకటప్పయ్యగారు.

మొదట బెజవాడలోను ఆ తర్వాత రెండేళ్ళకు కాకినాడలో జరిగిన కాంగ్రెసుమహాసభల జయప్రదంగా నిర్వహణలో వెంకటప్పయ్యగారు ప్రముఖ పాత్ర వహించారు. మహాత్మాగాంధి పిలుపు అందుకొని ఆరోగ్యం బాగుండకపోయినా వెంకటప్పయ్యగారు జైలుకువెళ్లారు. కొంతకాలం మద్రాసు శాసనసభ సభ్యునిగా వుండి తన ప్రతిభను నిరూపించుకున్నారు. ఆ తర్వాత మహాత్మా గాంధి ఆదేశం ప్రకారం శాసనసభా సభ్యత్వానికి రాజీనామా చేసారు. ఆ తర్వాత పార్టీలోకాని, ప్రభుత్వంలో కాని ఎట్టి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుకు పెద్ద దిక్కుగా వుండేవారు. పట్టాభి, ప్రకాశం, రంగా మొదలైన ప్రముఖ రాష్ట్ర కాంగ్రెస్ నాయకులందరూ వెంకటప్పయ్యగారిని పూజ్యభావంతో గౌరవించేవారు. ఆయన అజాత శత్రువు.

రాజకీయాలలో చురుకుగా పాల్గొనడానికి ముందే స్త్రీ పునర్ వివాహం వంటి సంస్కరణోద్యమాలలోనూ ప్రజలను చైతన్యవంతులను చేసే గ్రంథాలయోద్యమాలలో పాల్గొనేవారు. స్త్రీ జనాభ్యుదయంపట్ల వెంకటప్పయ్యగారికి ఆసక్తి ఎక్కువగా వుండేది. ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులతో కలిసి గుంటూరులో శారదా నికేతనం స్థాపించారు. గుంటూరులోనే నల్లపాటి హనుమంతరావుగారితో కలసి హరిజనోద్ధరణకు శ్రీకృష్ణాశ్రమాన్ని స్థాపించారు. అదేవిధంగా స్వామి సీతారాం స్థాపించిన వినయాశ్రమంలోనూ ఆయనకు ప్రమేయం వుంది.

వెంకటప్పయ్యగారు నిరాడంబరుడు. స్వచ్ఛమైన ఖద్దరు దుస్తులు వేసుకునేవారు. ముఖాన్న ఎర్రని నిలువుబొట్టు, ఎక్కడికైనా చిన్న సంచితో వెళ్ళేవారు. అదే ఆయన సామాను. ఆంధ్ర ప్రముఖులలో అనేకమందికి బిరుదులు వున్నాయి — అయితే ఆంధ్రరత్న, ఆంధ్రకేసరి వంటి "ఆంధ్ర" శబ్దంతో ముడిపడినవే. అందుకు అతీతమైన బిరుదులు వున్నవారు మనకు ఇద్దరే కన్పిస్తారు. ఒకరు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు కాగా, మరొకరు దేశోద్ధారక, విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారు. దేశభక్తికి సరైన నిర్వచనం వెంకటప్పయ్యగారి జీవితం.

వెంకటప్పయ్యగారు రచయిత. కృష్ణా పత్రిక సంపాదకుడు స్వీయ చరిత్ర రెండు భాగాలుగా రచించి, ఆనాటి సామాజిక పరిస్థితులను కళ్ళకు గట్టినట్లు మన ముందు వుంచారు. ఆయన ఆస్తికుడు, భక్తితత్పరుడు. తన ఇలవేల్పు అయిన శ్రీ వేంకటేశ్వరస్వామిపై భక్తిరసప్రధానంగా ఒక శతకం రాశారు.

దేశానికి స్వాతంత్ర్యం లభించిన రెండు సంవత్సరాలకు సరిగా 1949 ఆగస్టు పదిహేనున వెంకటప్పయ్యగారు కైవల్యం పొందారు. ఆయన ఇప్పుడు జీవించి వుంటే పతనమైన రాజకీయ విలువలను నైతిక ప్రమాణాల చూచి ఎంత ఆవేదన చెందేవారోనని అనిపిస్తుంది.

## విదుర నీతి

"సత్యం రూపం శ్రుతం విద్యా
కౌల్యం శీలం బలం ధనమ్
శౌర్యం చ చిత్రభాష్యం చ
దశేమే స్వర్గయోనయః"

సత్యము, సౌందర్యము, పాండిత్యము, విద్య, కులీనత్వము, మంచి ప్రవర్తన, బలము, ధనము, పరాక్రమము, చమత్కారముగా మాట్లాడుట — ఈ పది గుణములు స్వర్గమును సాధించునవి.



# గీత - అమృతవర్షిణి



శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లాని
ర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య
తదాఽఽత్మానం సృజామ్యహమ్॥

—ఇంతకుముందు శ్లోకమున అవతారియొక్క అవతరణ విధానము ఉగ్గడింపబడింది. ప్రస్తుతము అవతారకారణ ప్రకటనము సిద్ధిస్తున్నది. "ఏయే సమయములలో ధర్మమునకు కొరత యేర్పడి, అధర్మము అభివృద్ధి అగునో అట్టి సమయములందు నన్ను నేను సృజించుకొనుచున్నాను" అని భగవద్వచనము.

## సాయి గంగా మహాదేవ్

ఐతే మొట్టమొదట "ధర్మ"మంటే ఏమిటో విచారించాలి. చాలామంది "ధర్మ"మనగానే వర్ణాశ్రమ ధర్మములని, సాంఘిక ధర్మములని, దేశధర్మములని, దేహధర్మాదులని భావిస్తుంటారు. ఇవి అల్పార్థములు. వీనినే పిపీలికావిష్టార్థము లంటారు. అనగా చీమయొక్క రెట్టకు ఎంత విలువో వీనికినీ అంతే విలువ అని అర్థము. పరమాత్ముడు అల్పముల కోసం అవతరించాలా? వీనిని సరిచేయుటకు భగవంతుడవసరం లేదు. ఏ మహానుభావులైనా ఉద్ధరించగలరు. పనసకాయ తరుగ డానికి ప్రధానమంత్రిని పిలిచినట్లుంటుంది. ఇది సరికాదు—

"ధర్మ"మనగా—"ధరతి లోకానితి ధర్మః" లోకములను ధరించునది ధర్మము. "ధరతి విశ్వం ధర్మః" విశ్వమును ధరించునది ధర్మము. అనగా లోకములను విశ్వమును ధరించునది ధర్మము. ధరింపబడునది విశ్వము. అనగా ధర్మము ఆధారము ఐనటువంటిది. విశ్వము ఆధేయము ఐనటువంటిది. ఆధారాధేయములే ధర్మ, విశ్వములు. ఆధారము శాశ్వతము, అచలము, నిర్వికారము. ఆధేయము క్షణికము. కదలని తెరమీద కదిలే చిత్రములవలె, గతించని ఆకాశమున గతించే మేఘములవలె - ధర్మమునందు లోకములు పరిభ్రమిస్తున్నవి. అనగా ధర్మము బ్రహ్మాత్మత్వము.

కనుక "ధర్మగ్లాని" అనగా బ్రహ్మానుభవజ్ఞానము యొక్క కొరత. మానవులు తాము బ్రహ్మపదార్థమై యుండికూడనూ తాము బ్రహ్మమని గుర్తించక దేహాత్మ ధ్యాన తత్పరులై ప్రవర్తించుట అధర్మము. ఆత్మధ్యాన ధర్మము. దేహాత్మ ధ్యాన అధర్మము. అనగా ఏయే కాలములందు లోకులు ఆత్మధ్యానకు దూరులై, ఇంద్రియ ప్రేరితులై, విషయలంపటులై, దేహధ్యానతో ప్రవర్తిస్తుంటారో - అప్పుడు అట్టి అధర్మ కర్మ మర్మముల విప్పిచెప్పి, దినాలు మొనరించి ఆత్మధ్యానను వారిలో కలిగించుటకు రానవతరిస్తుంటానని ఈ శ్లోకమందలి భగవత్ హృదయము.

"సృజామి" అనగా లేనిదానిని సృష్టి చేయుట అని కాదు. అగోచరముగా ఉన్నదానిని గోచరమొనర్చుటయే సృజత్వము. భగవంతుడు నిరాకారుడుగా, నిర్గుణుడుగా వుంటూ అగోచరత్వముగా వుంటాడు, అట్టివాడు ఒక లీలా కల్పితాకారముతో, లీలా కల్పిత గుణగణములతో గోచరమగుటే సృజత్వము "సృజామ్యహమ్" అనగా "అగోచరముగా వుంటున్న నన్ను నేను గోచరమగునట్లు చేయుదును" అని అర్థము. అవతారమనగా ఇదే. అవతరణమనగా కూడనూ ఇదే. అగోచర స్థితినుండి, గోచరస్థితికి రావడమే అవతరణము, అవతారము.

ఇది ఎందుకు? అంటే—ఆత్మస్వరూపులై యుండి కూడనూ, తామాత్మ స్వరూపులమని గుర్తించక

పత్తింపవారల నుద్ధరించి, దేహ ధ్యాస నుండి దేహి ధ్యానలోనికి మళ్ళించుట. ఇదే పర్తిపుట్టి దివ్యావతారమైన భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరులు చేయుచున్న అవతార కార్యక్రమమిదే. తన భక్తులను "దివ్యాత్మస్వరూపులారా !" అని సంబోధిస్తుంటారు. అనగా తమ ఆత్మస్థితిని విస్మృతి చెందినవారలకు ఈ సంబోధన ద్వారా తిరిగి మీరు ఆత్మస్వరూపులని స్మృతి కల్పించుచున్నారు. ఇదీ అవతారమూర్తి **ధర్మోద్ధరణ** అంటే తక్కిన కర్మలు ధర్మోద్ధరణలు కావు, కర్మోద్ధరణలు.




కనుక కర్మ మర్మమెరిగి; ధర్మతత్త్వమెరిగి; దేహధ్యాస విడిచి; సాయిభక్తి పెరిగి; ఆత్మలోన ఒరిగి, కరిగి—శాశ్వతా నందపద్ధినోలలాడుదుము గాక! ఇతిశమ్!



# విజ్ఞానవాణి



## బస్సు

1662 లో కారాస్సి పేరుతో ఎనిమిది మంది ప్రయాణం చేయగలిగిన గుర్రపు బండిని పారిస్‌లో తొలిసారిగా ప్రారంభించారు. 1823 లో ఈ గుర్రపు బండి నాంటస్, ఫ్రాన్స్‌ల మధ్య తిరిగేది. క్రమక్రమంగా ప్రయాణీకుల సంఖ్య పెరగడంతో పరిశోధనలు ప్రారంభమై పెట్రోలుతో నడిచే బస్సులను కనుగొన్నారు. 1878 లో ఆరు టన్నుల బరువు గల బస్సు 18 మంది ప్రయాణీకులతో ప్రారంభమైంది. 1930 లో డబుల్ డెక్కర్ బస్సులను లండన్‌లో తయారుచేసారు. పెట్రోలు ధర అధికం కావడంతో డీజిల్ ఆయిల్‌తో నడిచే యంత్రాలను బస్సులకు అమర్చడం మొదలయింది.

## అనిస్థెటిక్స్

డాక్టర్లు పూర్వం శరీరంపై శస్త్రచికిత్స చేసేటప్పుడు ఆల్కాహాల్ తాగించి వైద్యం చేసేవారు. తాగడంవలన క్షతగాత్రులకు నొప్పి, బాధ వుండదని, తదుపరి ఆపరేషన్లు లేక పళ్ళు పీకివేయాల్సి వచ్చినప్పుడు అనిస్థెటిక్స్ ఇచ్చేవారు. 1799 లో సర్ హంఫ్రీడవీ అనే కెమిస్ట్, రోగులకు నైట్రస్ ఆక్సైడ్ యిచ్చి ఆపరేషన్ చేసే విధానం మొదలెట్టాడు. 1842 లో విలియం క్లార్క్ అనే అమెరికాకు చెందిన వైద్యుడు ఈథర్ యిచ్చి నొప్పి కలగకుండా పిప్పిపళ్ళు పీకడానికి ఉపయోగించేవారు. ఇడెన్‌బర్గ్‌కు చెందిన సర్ జేమ్స్ సింప్సన్ అనే డాక్టరు ఆపరేషన్ చేసేటప్పుడు క్లోరోఫాం ద్వారా మత్తు కలిగించి చికిత్స చేసేవాడు. క్రమక్రమంగా రోగికి బాధ, నొప్పి కలగకుండా వుంచేందుకు మత్తు కలిగించి చికిత్స చేయడం వైద్య శాస్త్రంలో చోటు చేసుకుంది.

- జి. ఎస్. సాయినాథ్

# దేవలుని కూతురు సువర్చల కథ

బ్రహ్మర్షి, సదాచార సంపన్నుడు, ధార్మికశ్రేష్ఠుడు, విప్రపూజితుఁడునగు దేవల మహర్షియొక్క చక్కని కూతురగు సువర్చల తండ్రి కడ సర్వధర్మములు, సకల విద్యలు నేర్చి గొప్ప విదుషీమణియయ్యెను. శుభ లక్షణ సంపన్నయు, సుందరాంగియునగు నామెకు యుక్తకాలము రాగానే తండ్రి వివాహ ప్రయత్నము చేయ దొడగెను. ఇది తెలిసి సువర్చల తండ్రితో "తండ్రీ! నీవు ప్రాజ్ఞులలో ప్రాజ్ఞుడవు. నాయెడ నమిత వాత్సల్యము గలవాడవు కనుక, నాకొక్క కోరిక కలదు, అది తీర్చుము. నా భర్త ఏక కాలముననే గ్రుడ్డివాడు, కానివాడు గావలయును. అట్టివానినే నాకై వెదకు"మని చెప్పెను. దేవలుఁడామె మాటలకు నవ్వి "తల్లీ! అట్టి పతిని నీకై నేనరయజాలను. ఉత్తము లైన ఋషిపుత్రుల నెందరినో యిటకు రప్పించెదను. నీవే వారిలో నీకు గావలసిన లక్షణములు గలవాని నేఱు కొమ్ము" అని పలికెను. ఆమె అట్లే కానిమ్మనెను.

పిదప దేవలుడు శిష్యులంబిలిచి వేదవిదులు, సదాచార సంపన్నులు, శీలయుతులు, యువకులు, సౌందర్యనిధులు, సత్సంప్రదాయయుతులు, బ్రహ్మచర్యవ్రతులు, వివాహేచ్ఛ గలవారు నగువారిని బిలుచుకొనిరండని పంపెను. దేవల శిష్యులాప్రకారము సర్వాశ్రమములందు దేవలుని యభిమత మెరిగించి తమతో గూడ నెందరినో వటువులను దీసుకొని వచ్చిరి.

దేవలుఁడు వారందరు నాదరించి కూర్చుండ నియమించి సుపుత్రియగు సువర్చలకు వారినెల్లర జూపి వారి గుణగణములగ్గించి వలయువానిని వరించుమని చెప్పెను. సువర్చల ముందుకు వచ్చి "మహాత్ములారా! మీలో నేకకాలమున నంధుడు, అంధుడు కానివాడు నున్నచో నాతడు నన్ను వివాహమాడ నర్హుడు. అతడే యుండి మిగిలినవారెల్లరు పోవచ్చు"ననెను. ఆమె మాటలు విని ఎల్లరు తెచ్చిపోయి యామె వివేకహీన యనియు, దేవలుఁడామె మాటలు విని యట్లు చేయుట ధర్మమా యనియు నమకొనుచు వెడలిపోయిరి. కాని, ఉద్దాలకుని పుత్రుడగు శ్వేతకేతువు ముందుకు వచ్చి "కల్యాణీ! నీవు కోరినటి లక్షణములను గలవాడను నేను. నేను గ్రుడ్డిని. [illegible] వివాహమును. నీవు నన్ను పెట్టిపట్టు"మనెను. [illegible] "[illegible]! నీవెట్లు రెండు నగుదువో వివరింపు"మని కోరెను. అంత శ్వేతకేతుఁడు "తరుణీ! ఏ కంటిచేత ప్రపంచమును జూచుచు, ధర్మములు చేయుచు మనుష్యు సంకల్పించుచు బుద్ధి నిజము తెలియునో, అజ్ఞానమను ఆ కన్ను లేనివాడు పుట్టు గ్రుడ్డివంటివాడు. ఏ కన్ను భ్రాంతి నిలయము, నశ్వరమునగునో అజ్ఞానమను ఆ కన్ను లేనివాడను గాన నేను గ్రుడ్డివాడను. ఆత్మానాత్మ వివేకము గల జ్ఞాననేత్రము నాకు గలదు. కావి నేను గ్రుడ్డిని కాను" అని పలికెను. సువర్చల యంగీకరించి తండ్రికి తన సమ్మతిని దెలిపెను. పిదప దేవలుడు విద్యుక్తప్రకారము సువర్చలాశ్వేతకేతులకు బహు వైభవోపేతముగా వివాహము జేసి యాశీర్వచనములతో బంపివేసెను. సువర్చలాశ్వేతకేతులు బ్రహ్మజ్ఞాన సంపన్నులై దివ్యమగు గృహస్థ జీవనమును గడిపి తుదకు మోక్షలక్ష్మిని గాంచిరి.

సేకరణ:

**తాటికొండ తిరుపతయ్య**

# శ్రీ సత్యసాయి గీతాభాష్యము

భక్తి వల్లనే జ్ఞానము పుట్టును (భక్త్యాజ్ఞానం ప్రజాయతే). 'నహి జ్ఞానేన సదృశం'—జ్ఞానముతో సమానమైనది వేరొకటి లేదు. సంసార సముద్రమును దాటించి పరమ ప్రాప్తిని ఏది కలిగించునో దానినే జ్ఞానమందురు. దీనిలో లౌకికమైన విషయ జ్ఞానమును ఆశించక, 'అహం బ్రహ్మాస్మి' అను బ్రహ్మాత్మ విజ్ఞానము గల అభేదజ్ఞానము సంసార భయాన్ని నివారించి, మానవుని నిర్భయ స్వరూపునిచేసి, బ్రహ్మ ప్రాప్తిలో ప్రవేశపెట్టును. దీనిని సమ్యక్ జ్ఞానము (బుద్ధికి సాక్షియై యుండును) కూడ అందురు. అట్టి జ్ఞాన ఫలమును భగవంతుడే అందించును. వేదాంత పరిభాషలో భగవంతుడు సచ్చిదానంద స్వరూపుడు అని ఉన్నది, సంస్కృత భాషలోని అర్థము అస్తి, భాతి, ప్రియము. ఈ మూడూ ఒకటే. సత్ అనగా ఎల్లప్పుడూ ఉండునది, దానినే సంస్కృతమున అస్తి అందురు. చిత్ అనగా అన్నింటిని తెలిసికొను శక్తి. దీనిని సంస్కృతములో భాతి అందురు. ఇక ఆనందమనగా నిరంతర సుఖాపేక్ష. దీనిని సంస్కృతములో ప్రియం అందురు. ఈ మూడును, ప్రతి మానవుని యందును, పశు పక్షుల యందును ఉండును. దేహము నశించునది. కాని ఆత్మమరణమన్న ఇష్టపడడు. మానవుడు సత్ స్వరూపుడు. అట్టి మరణము లేని ఆత్మసర్వ ఉపాధులందును ఉండును. స్వయముగా చైతన్యమైన చిత్ శక్తికి జడ వస్తువులనుకూడ చైతన్యవంతముగా ప్రకాశింపజేసే స్వభావము సహజముగా నున్నది. ఈ లక్షణము మానవుని యందు మెరయుచు, మెరపించుచున్నది. జీవుడు స్వయముగా సుఖ స్వభావుడు. ఆనంద స్వరూపుడు. వాడు దేహస్వరూపమున లేడు. దేహము తాను కాదు. ఆత్మ తాను. ఆత్మకు సుఖం సహజం. అందుచే దుఃఖమును ఇష్టపడడు. ఆ సుఖమునకు ఆశ్చర్యపడనక్కరలేదు, అది సహజమైనది కనుక. అయితే ఈ సుఖము, ఆనందము ఆత్మకు సహజము. ఆత్మ సుఖస్వభావము కలది కనుక. అందుచే నిరంతరము, సుఖమునే కోరును. మానవుడు

టా మ యూ రి ప్ర భ

నిరంతరము, సర్వ కర్మలయందు, సర్వ ప్రాంతములందు సుఖముగానే ఉండవలెనని కోరును. ఏ పూజలు, భజనలు చేసినా, వ్రతములు ఆచరించినా, యాత్రలు చేసినా, ... ములు చేసినా ఏమి చేసి... ...రూ సుఖముగా ఉండవలెననే ప్రార్థింతురు. అజ్ఞానికి ఆత్మ, అనాత్మ; క్షేత్రము, క్షేత్రజ్ఞుడు; దృక్కు, దృశ్యములు ఏకమైనట్లు కన్పడును. దానిని విడదీయుటయే (విభజించుటయే) జ్ఞానము. విభాగమనగా విడదీయుట. దృశ్య ప్రపంచములోని ప్రతి వస్తువునందు ఏది సత్యమో (అస్తి, భాతి, ప్రియము), ఏది అసత్యమో (నామరూపములు) విభజించి గ్రహించి ఆత్మయందు ఆసక్తియుంచి, అనాత్మయందు విరక్తిభావమును కలిగియుండుటే జ్ఞానుల లక్షణము. శరీరము ప్రవృత్తి యందున్నను, మనస్సును నివృత్తి యందుంచుకొనవలెను (Hands in the Society and head in the forest). అజ్ఞాని దేహమే నేనను భావముచే చేయు కర్మల వలన బద్ధుడగును. జ్ఞాని నేను దేహమును కాను, సచ్చిదానంద రూపమును అను దృఢ నిశ్చయముతో ముక్తుడగును. (13వ—18 శ్లోకములు). భగవద్గీతలో క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము (13వ), గుణత్రయ విభాగయోగము (14వ), దైవాసుర సంపద్విభాగయోగము (16వ), శ్రద్ధాత్రయ విభాగయోగము (17) లు ప్రత్యేకముగ

చెప్పబడినవి. జ్ఞానికి జ్యోతిర్మయుడైన కృష్ణ పరమాత్మునకూ ఎట్టి భేదము లేదనెను. "నన్ను పొందుటకు అందరికినీ అధికారము కలదు. భేదభావములు సాధకులలోని దోషములే కాని నాలోని మచ్చలు కావు" అని కృష్ణుడు పరమాత్మ భేదరహితుడు, సమానహృదయుడు, భక్తుల అంతరాత్మను చూచును. కానీ పైపూతలను కాదను విషయమునకు నిదర్శనముగా గోపికలకు సాయుజ్యము నిచ్చుట, శబరి ఎంగిలి ఫలములను భుజించుట, జనకుడు బ్రహ్మజ్ఞానమును పొందుట: నందనారుకు దివ్యదర్శన మిచ్చుట: వానరుడైనా హనుమంతుని బంటుగా అంగీకరించుట: వాల్మీకి రామాయణమును వ్రాయగల్గుట చెప్పెను. పరిపాకమును దర్శించుటకు పరిపాకమే కావలసిన రీతిగా మాధవత్వమును తెలిసికొనుటకు మాధవత్వమునే స్మరించుచు, చరించుచు, ఆచరించవలెను.



# మికి చెట్టు



ఇది అడవులలో నుండు వృక్షము. దీనిలో పెద్ద తుమికి, చిన్న తుమికి అని రెండు రకముల జాతులు గలవు. దీని ఆకులు నలుపు వర్ణము. చెట్టు పట్టకూడా కొంచెము నలుపు వర్ణముగనే కనిపించును. మాను మధ్యమున నల్లని ఉక్కువంటి చేవ ఉండును. మిక్కిలి గట్టితనము గలది. పండు గుండ్రముగా నిమ్మపండును బోలియుండును. చిన్న తుమికికి చిన్న సైజులో ఉండును. కాయల భేదము చేతనే జాతి భేదమును తెలిసుకొనవలెను. ఈ వృక్షములు యితర ప్రదేశము లలో కంటే బెంగాల్‌లో విస్తారముగా కనిపించును. దీని ఆకులు పొడవుగా నుండును.




దీనియొక్క పట్టయు, పండ్లును, యెండు గింజలును కూడా వైద్యమునకు ఉపయుక్తములే.

పచ్చికాయ గుణము వర్ణించిన వగరు, చేదు రుచుల మిశ్రమముని తెలియును. శీతగుణము గలది, చలువ చేయును. మలబద్ధమును గలిగించును

పండు తీపి, చేదు, వగరు రుచుల సమ్మేళనము. ఇదియును చలువ చేయు స్వభావము గలది. గురు గుణము. పిత్త, కఫ, రక్త, ప్రమేహ దోషాదులను హరించును. పెద్ద, చిన్న రకముల రెంటింటి గుణములూ సమానములే.

దీని చెక్క ఉడికించి, పైగా నూరి పైన పట్టు వేసిన గాలిబిళ్ళలు తగ్గును. ఇంతియే గాక కంఠము నందలి గ్రంథులుగూడ తగ్గును: దీని చెక్క కషాయము (solution) ఒక రేటుతో గర్భద్వారమును కడిగిన ప్రదరములు తగ్గును: పండుమొక్క గుంజు గాని లేక కషాయముగాని లోపలికి సేవించిన గ్రహణి, అతిసారము తగ్గును: బాగుగా పండిన పండను అలవాటు చేసుకొని తినుచున్న సెగ రోగములు, కుష్ఠులను నశింపజేయును.

- యస్. యస్. దుర్గారావు